# పరిచయ వాక్యము

"దివ్యజీవనము" అనే ఈ గ్రంథము ఫ్రెంచిభాషలో విక్టరు హ్యూగో వ్రాసిన "లే మిజరాబిల్" అనే వచనకావ్యమున కనువాదము. ఇది ఫ్రెంచి సారస్వతమున ఉన్నతస్థాన మాక్రమించుకొనియున్న నవల. దీనిని ఫ్రెంచిలో వచన మహాకావ్యముగా పరిగణించుచున్నారు. విక్టరు యూగో కవిత్వమును చెప్పి, నాటకములు వ్రాసి, అత్యుత్తమ నవలలు వ్రాసి ప్రసిద్ధినందెను.

ఈ నవలలోని బిషప్పు జీవన్ముక్తునివంటివాడు. ఈతని మహాత్తువల్లనే జీన్ వాల్ జీన్ వంటి పాపి పరమపవిత్రుడై, మహాత్ముడై, స్వార్థరహితముగా జీవించి ఆదర్శపురుషుడాయెను.

మానవుడు చేసిన శాసనములకును, మానవశక్తికిని పోరాటము సంభవించినప్పుడు మానవశక్తియే విజయము నందగలదని ఈ నవల నిరూపించుచున్నది.

ఈ గ్రంథమును శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు అనువదించిరి. వీరు పండితులు, కవులు, ఆంధ్ర పాఠకలోకమునకు చిరపరిచితులు. మాతృకలోని మూలకథను మాత్రమే గ్రహించి వీరు తెనుగులో చక్కని శైలిలో వ్రాసిరి. ఫ్రెంచిపేర్లు మార్చక ఫ్రెంచి వాతావరణమును ఉన్నదున్నట్లు ఇందు చిత్రించినారు.

ఉత్తమాదర్శములను మానవులకు చూపు ఈ గ్రంథము అప్రతిమానమైనది. ఎల్లరు దీనిని చదివి ఆనందింతురుగాక.

—చింతా దీక్షితులు.

# దివ్య జీవనము

## ౧

పరాసుదేశమున 'డి...' అను చిన్న పత్తన మొకటి కలదు. అం దొక బాటగుండ ఒకఁడు నడచిపోవు చుండెను. అతనికి ఎముకపుష్టియు, కండపుష్టియుఁ గలవు. గడ్డమును, మీసములును పెరిఁగియుండెను. అతనికి సుమారు నలుబదియాతేండ్లు. తలమీఁద ప్రాఁతటోపీ. నల్లని కోటు. దానికి వెనుకముందుల మాసికలు. వానికి మరల చిల్లర మాసికలు. కోటులోపల మాసినచొక్కా. దాని కొక గుండి యేని లేదు. పలకవంటి అతనియెదురొమ్ముమీఁది వెండ్రు కలు ఎలుగుబంటి వెండ్రుకలవలె నా చొక్కాలగుండ కానఁ బడుచుండెను. పాదములకు మేజోళ్లు లేవుగాని బూట్సులు కలవు. చినిఁగిన లాగు. చేతిలో నొక బాణాకఱ్ఱ. వీఁపున నొక చిన్నమూట. ఇటు లితఁ డిరువదియాఱు మైళ్ల దూరమునుండి ఒక్కబిగి నిక్కడికి నడచి వచ్చెను. అతని కణఁతలనుండి చెమటబొట్లు పడుచుండెను.

అప్పటి కింకను రోడ్లమీఁద దీపములు వెలిఁగించు వేళ కాలేదు. అటు లాదారిని బడి పోవుచుండఁగా నతని కొక పూఁటకూళ్ల యిల్లు కానిపించెను. వాని ప్రాణములు లేచివచ్చెను. అతఁ డటు ఇటు చూచి గభాలున నందుఁ జొరఁబడెను.

లోపల అన్న ముడుకుచుండెను. కూరలు నారలు సిద్ధమాయెను. ప్రక్కగదిలోఁ గొందఱు విశ్రమించి యుండిరి కాఁబోలు, వారేవో కమ్మసుద్దు లాడుకొనుచు, మాటలాడుకొనుచుఁ గూనలమ్మసంకీర్తనములు చేయుచుఁ, బాటలు పాడుకొనుచు నుండిరి.

పూఁటకూళ్లవాఁడు లోపలికి వచ్చిన ఈమనుష్యునిఁ జూచి—"అయ్యా! యేమి పని?" అని అడిగెను.

"నాకుఁ గొంచె మన్నమును, బండుకొనుటకుఁ జోటును గావలెను." పూఁటకూళ్లవాఁడు మొగమెత్తి వాని వాలకమును జూచి "డబ్బున్నదా?" అని యడిగెను.

"లేకేమి?" అని పలుకుచు నతఁడు జేబునుండి యొక సంచి పైకెత్తి, వెంటనే జేబులోఁ బెట్టుకొని, తలుపు ప్రక్కనున్న బల్లమీఁదఁ గూలఁబడెను. పిమ్మట నతఁడు తన వీఁపుమీఁదనున్న మూటను బ్రక్కగాఁబెట్టుకొని, బాణాకఱ్ఱను రెండు చేతుల నడుమ నదిమి పట్టుకొని, యొకసారి నిట్టూర్చి "అన్న ముడుకుటకు జాగగునా?" అని యడిగెను.

"ఎంతో జాగు కాదు" అని ఆ పూఁటకూళ్ళవాఁడొక గుండ్రని బల్లకడకుఁజని, నాఁడు వచ్చిన పత్రికయంచు కొంచెము చించి, దానిమీఁద నేమియో వ్రాసి, చేతఁ బట్టుకొని గంట ప్రయోగించెను. అది విని పది పండ్రెండేండ్ల కుఱ్ఱవాఁ డొకఁడు వచ్చి నిలువఁబడెను. పూఁటకూళ్ళవాఁడు వానిచేతి కా కాకితమిచ్చి, చెవియుఁ జెక్కు నెఱుఁగకుండ నేమో చెప్పెను. ఆ కుఱ్ఱఁ డా కాకితమును దీసికొని కాకివలె నెగిరిపోయెను.

పూఁటకూళ్లతఁడు మరల నతనిఁ బరికించెను. అతఁడు వెనుకటివలెనే కదలకయు మెదలకయుఁ గూరుచుండి నడుమనడుమఁ గునికిపాటులు పడుచుండెను. వెళ్లిన కుఱ్ఱఁడు చిట్టమిడుచునంతలో వెళ్లి, యింకొక కాకితమును దెచ్చి పూఁటకూళ్లవానిచేతి కిచ్చెను. అంత నతఁ డాచీటి చదివికొని తల యూఁపి—'అమ్మబాబో!' అని యనుకొని యా వచ్చిన మనుష్యుని కడకు వెళ్లి—"ఏమండీ! మీ కిచటఁ దావాసగుఁటకు వీలులేదు" అని చెప్పెను.

"ఏమది?" అని తల పైకెత్తి చూచి, "నాకడ డబ్బు లేదని అనుకొనుచున్నారా? లేక ముందరనే యీయ వలయునా? సరిగాఁ జెప్పుఁడు" అని యాతఁ డనెను.

"ఆసంగతి కాదు."

"మఱియేమి?"

"ఇచట మనుజు లెక్కుడగుటచే నిఱుకుగా నున్నది. మీకుఁ దావు దొరకదు."

"పోనిండు, ఆ గుఱ్ఱాలసాలలోఁ బడుకొందును."

"అచట వీలు లేదు."

"కట్టుకొని పోయినంత చోటుండఁగా లేదులే దందు రేమండీ! అదిగో ఆ మెట్ల క్రింద, లేదా ఇక్కడనే, కాదా యెక్కడనో యొకచోటఁ, గొంచెము వీలుచేసికొని పడియుందును. నాకేమియు నక్కఱలేదు. ఒక పన గడ్డి పెట్టుఁడు, చాలు. లేదా ఆసంగతి నేనే చూచికొందును. ముందు రెండు మెతుకులు మాత్రము పెట్టుఁడు."

"అయ్యో! అటులు వీలు లేదు. మీ కన్నమయిన

నిచటఁ బెట్టుటకు వీలు లేదు."

ఈమాటలతో నాతఁడు లేచి నిలువఁబడి—"నేఁటి నా యవస్థ మీ రెఱుఁగరు. కడుపు మలమల మాఁడిపోవు చున్నది. కాళ్లు తడబడుచున్నవి. ప్రొద్దుటినుండి యిం దనుక నడచుచునే యుంటిని" అనెను.

"కావచ్చుఁగాని యిచట మీ కన్నము లేదు."

అతఁడు బిట్టు నవ్వి, వ్రేలఁ జూపి "అదంతయు నేమి?" అని యడిగెను.

"అది యింకొకరికి. ఆప్రక్కగదిలో మాటలు విను చుంటిరిగదా, వారికి."

"వా రెందఱు?"

"పన్నిద్దఱు."

"వారు తిన్నను నింకను బన్నిద్దఱకు సరిపోవునే. నాకు చిన్నము చిదరయుఁ జాలును" అని అతఁడు మరలఁ గూలఁబడి—"పూఁటకూళ్ళ యింటికి వచ్చితిని. కడుపు మాఁడుచున్నది. అన్నముతినక నేనిటనుండి కదలను" అనెను.

"బలేవాఁడవు! ఏల కదలవో నేనును జూచెదను. లే. పోదువా, పోవా?"

ఆ వచ్చినవాఁ డేదియో మాటలాడఁబోయెను గాని అంతలో నా పూఁటకూళ్లవాఁడు చేయెత్తి—"ఆఁగు! నిన్ను నే నెఱుఁగ ననుకొంటివా! నీ పేరు చెప్పనా? నిన్నుఁ జూచినంతటనే నాకు సందియము కలిగెను. మేయరు (Mayor) కడకుఁ గుఱ్ఱవానినంపి కనుగొంటిని. ఇవిగో ఈ కాకితము మీఁద నీ పుట్టుపూర్వోత్తరములు. ఇదె చదువుకో. చదువు

వచ్చునా?" అని పూటకూళ్లు పెట్టువాఁడా కాకితమును వానిచేతిలో గ్రుచ్చి—" నే నెవరితోడను గయ్యమునకుఁ గాలు సాఁపను. నీతోడను అంతియే. నీ పేరు జీన్ వాల్ జీన్. ఇంకఁ జాలు" అనెను.

అతఁడు మఱిమాటాడక మూట చంక నిఱికించుకొని లేచి పూఁటకూళ్లవానివంక దీనముగాఁ జూచి యిల్లు వెడలెను. మరల దారియే యతని కాశ్రయమాయెను. 'ఎక్కడికిఁ బోవను? ఎచ్చటఁ దిండి? ఎచట నిద్ర?' అని చింతించుచు నత్తఁడొక్కొక యడుగు పెట్టుచుఁ బోవుచుండెను. 'ఇటఁ దావులేకపోనీ, చిన్న పూఁటకూళ్లయింటఁ గలదేమో! ప్రయత్నించి చూచినచోఁ దప్పేమి? చీఁకటి పడుచున్నది. ఆఁకలి మాఁడ్చుచున్నది' అని తలఁచుచు నతఁడు ప్రక్కసందునఁ బడి యొక చిన్న పూఁటకూళ్లయింటికిఁ జనెను. ఇంటినడుమ దీపము మినుకుమినుకు మనుచుండెను. జీన్ వాల్ జీన్ మొగముమీఁది వ్రాలు తడుముకొనుచు లోనికిఁ జనెను.

"ఎవరు వారు?"

"అయ్యా! నే నొక బాటసారిని. నాకిచటఁ దినుట కన్నమును, బండుటకుఁ జోటును దొరకునా?"

"ఆఁ. దొరకును. లోనికి రండు."

జీన్ వాల్ జీన్ ఇంటిలోని కడుగిడెను. లోపల నున్న వారందఱు నతనిని విడ్డూరముగాఁ గాంచిరి. పూఁటకూళ్లవాఁడు—"అయ్యా! అచటఁ గూరుచుండుఁడు. కొంచెము సేపటిలోనే వడ్డింతును" అనెను.

అచటనున్న యొకబల్లమీఁద వాల్ జీన్ తన మూట

పెట్టి దానిప్రక్కఁ దాను గూర్చుండి కాళ్లుజాడించి 'బ్రతుకు జీవుఁడా!' అని నిట్టూర్చెను.

ఆ యింట నపు డున్నవారిలో నొకఁడు చేఁపల వర్తకుఁడు. అతఁ డీ బస్తీకి రెన్నాళ్ల కొకతూరి గుఱ్ఱముమీఁద వచ్చుచుఁ బోవుచు నుండును. పెద్దపూఁటకూళ్లయింట వెల యెక్కువయని యతఁ డీ చిన్న పూఁటకూళ్ల యింటనే కడుచును గాని గుఱ్ఱమున కిటఁ జోటులేమి నటఁగల గుఱ్ఱపుసాలలో దానిని గట్టివేసికొనుచుండును. ఈనాఁ డతఁ డచటఁ దన గుఱ్ఱమును గట్టివేసికొనుచు జీన్ వాల్ జీన్ సంగతి యంతయు వినెను. ఇపు డా విన్న దంతయు నతఁ డా పూఁటకూళ్లవానికిఁ జెవిలోఁ జెప్పివైచెను. అంతట నా పూఁటకూళ్లవాఁడు వాల్ జీన్ కడకు వెళ్లి మీఁదఁ జేయివైచి—

"ఓయీ! నీ విచట నుండుటకు వీలులేదు" అనెను. వాల్ జీన్ కుఁ గొంచెము మత్తువచ్చెఁ గాఁబోలు, "అన్నము తెచ్చితివా?" అని ఉలికెను.

"కాదు. అన్నము తేలేదు. నీ విట నుండరాదు."

"ఓహో! మీకును దెలిసెనా?"

"అగును."

"అటులా? న న్నా పూఁటకూళ్లయింటినుండి వెళ్లి పొమ్మనిరి."

"మేమును ఆ మాటయే యనుచుంటిమి."

"నే నిపు డెచటికి పోను?"

"ఇష్టము వచ్చిన చోటికి."

వాల్ జీన్ మఱి మాటాడక అటనుండి లేచి దారిఁ

బడెను. అతఁ డా పెద్ద పూఁటకూళ్ల యింటినుండి వెలువడఁ గనే కొందఱు బాలురు మూఁగి, వానిపైఁ జిన్నచిన్న గడ్డలు రువ్వఁదొడఁగిరి. ఇపు డీ యిల్లు వెడలఁగనే వారు తమపనికిఁ బూనుకొనిరి. వాల్జీన్కుఁ గినుక పెరిఁగెను. అతఁ డొక తూరి వెనుదిరిగి కఱ్ఱచూపి "గాడిదలారా! నిలుఁడు, మీ బుఱ్ఱలు పగులఁగొట్టెదను" అని యనవఁగనే బాలు రందఱును గిలకిల నవ్వుచుఁ బరుగులుతీసిరి.

అంతట నతఁడు రెండడుగులు వైచెను. బాటమీఁద నొక సింగపు మొగసాలయు, దానిలోపల పెద్ద పెద్ద బవంతు లును గానవచ్చెను. అది చెఱసాల! 'ఇట నీ రేయి నిదిరింప లెస్సగనున్న'దని దాని నంతయుఁ బరికించి యతఁ డది చెఱ సాల యని తెలిసికొనెను. అతని యొడలు జల్లుమనెను. అంత నతఁడు ముందునకు సాగిపోయెను.

బాట కిఱుదెసలఁ జిన్నచిన్న తోఁపులు. వానినడుమ నొక్కొక మేడ. అతఁ డా మేడలను వింతగఁ జూచుచు నడచి పోవుచుండెను. అతనికిఁ బ్రతిమేడయు విచిత్రముగా నుండెను. మేడలపై దివ్వెలు వెలుఁగుచుండెను. అతఁ డటు పోవుచుఁ బోవుచు నొకమిద్దెకడ నాఁగెను. ఇంటినడుమనుండి వెలుఁగు కానిపించుచుండెను. కిటికీతలుపులమీఁద వ్రేలాడు పచ్చని తెరలోనుండి లోపలనున్న గుండ్రనిబల్లయు, దానిమీఁది పూలతొట్టియు, నొకపిస్తోలును అగపడుచుండెను. ఆ యింటి వాఁ డొక శిశువు నాడించుచుఁ గుర్చీలోఁ గూరుచుండెను. అతని భార్య మఱియొక శిశువు నాడించుచు మఱియొక కుర్చీలోఁ గూరుచుండెను. ఆ యిరువురు శిశువులును గిలకిల

నవ్వుచుండఁగా వారి తలిదండ్రులుగూడ నవ్వుచుండిరి.

'ఆనందము ప్రవహించుచున్న యీయిల్లు నా కొకింత చోటిడకపోవునా?' యని యతఁడు మెల్లగా వాకిటి కరిగి తలుపు తట్టెను.

"ఎవరా తలుపు పగులఁగొట్టునది?" అని యిల్లాలఱచెను. "ఎవరును లేరే" అని యింటివాఁడనెను. మరలఁ జప్పుడాయెను. "అదిగో వినుఁడు" అని యిల్లాలనెను. లాంతరు చేతఁ బుచ్చుకొని యింటియాతఁడు తలుపు తెఱచి "ఎవరు వారు?" అని యడిగెను.

"అయ్యా! నే నొక బాటసారిని. ప్రొద్దుటినుండియుఁ గూడు లేదు. పండఁ జోటులేదు. రెండుమెతుకులు విసురుచోఁ దిని యా బయటి పాకలోఁ దేఁడి లేఁచి పోవుదును" అని జీన్ వాల్ జీన్ అనెను. "అందుల కగు బాడుగ తప్పక యీఁగలను" అని వెంటనే యనెను.

ఇంటియాతఁడు లాంతరెత్తి రెప్పవాల్పక చూచి— "బాడుగ యీఁగలిగినచోఁ బూఁటకూళ్ళయింటి కేల పోవైతివి?" అని యనెను.

"అచటఁ జోటులేదు."

"ఏమీ వింత! అదిగో అచట పెద్ద గుఱ్ఱాలసాల యున్నదే. అది పెద్దపూఁటకూళ్ల లోఁగలి. అచటికి వెళ్లితివా?"

"చిత్తము."

"అక్కడను జోటు లేదా?"

అక్కడ జఱిగిన సంగతి చెప్పుట కతని కిష్టము లేదు

గాని చెప్పక తప్పదు. కావున నతఁ డిటు లనెను—

"నన్నుఁ జూడఁగనే వారు చోటు లేదనిరి."

"పోనీ, అట లేనిచో లేకపోయె. మఱి చాలఁ బూఁట కూళ్ళ యిండ్లు చిన్నవి కలవే! అచటి కేల పోలేదు?"

"అక్కడికిని వెళ్ళితినిగాని నా యదృష్ట మొక తీరుగనే యున్నది."

ఇఁక విశేషించి చెప్ప నక్కఱలేకపోయెను. ఆ యింటివాని కాతనియెడ గట్టిగా సందేహము కలిగెను. అంతట నతఁడిటు లనెను—"ఇన్ని చోటుల నీకుఁ జోటు దొరకనిచో నిచటఁగూడ దొరకదు."

ఇటులుజరుగునని వాల్జీన్ లోఁగడనే యనుకొనెను. "పోనిండు. నో రిగిరిపోవుచున్నది! గ్రుక్కెఁడు మంచి నీ రిప్పింపుఁడు" అని అతఁ డడిగెను.

"అందులకును వీలులేదు" అనుచు నాయింటివాఁడు వాని మొగముమీఁదనే తలుపులు ఛడేలుమని వేసెను.

జీన్ వాల్జీన్ అటనుండి వెనుదిరిగి మరల దారిని బడెను. కొంచెము దవ్వేఁగఁగా నచట నొక పాక నేల కానుచుఁ గాననాయెను. అది రస్తాలు మరమ్మతు చేయువారు వేసికొనిన పాక.

"తిండిలేకపోయినఁ బోయె. పండుటకైనను రవంత చోటు దొరకె" నని సంతసించి యతఁడు వంగి దానిలో దూఱెను. మూటయుఁ, గఱ్ఱయుఁ దలక్రింద నిడుకొనెను. కఱ్ఱవలెఁ బఱుండి కాళ్లు జాడించెను.

ఇంతలో నొక కుక్క యతని తలవెనుక 'బాబా'

మని యఱవఁ దొడఁగెను. జీన్ వాల్‌జీన్ దానికిఁ గట్టి
చూపెను. కాని లాభము లేకపోయెను. అతఁడు బెదరించిన
కొలఁదియు నది యెక్కుడు పట్టుదలతో మొఱిఁగి యతని
లాగులోని కంతల నెక్కువ చేసెను.

'అయ్యో! దేవుఁడా!' యని యనుకొనుచు వాల్‌
జీన్ అక్కడినుండి లేచి మరల దారినిఁబడి 'కుక్కకుఁగూడ
నామీఁద దయలేకపోయెనే! చాలు నిఁకఁ జాలు. మనుష్యులు
లేనిచోటికిఁబోయి పండుకొందును' అని నడచి పోఁదొడఁగెను.

చంద్రుఁ డుదయించెను. వెన్నెల లలముకొనెను. చలి
పెరుఁగఁ జొచ్చెను. నడచి నడచి యతఁడు అలసిపోయెను.
చలి యచట నతనిని గడగడ లాడించెను. అతఁడచట నిలిచి
నలుప్రక్కలఁ బరికించెను. మఱియొక దారిఁబట్టుకొని మరలఁ
బత్తనములోనికిఁ బోఁజొచ్చెను. కొంచెముదూరము వెళ్ళఁ
గనే అచటనొక 'చర్చి' కనఁబడెను. దానికి నలుప్రక్కలం
జిన్నవియుఁ బెద్దవియు నగు నిండ్లుండెను. ఎదురింటి కిటికీ
సందులనుండి యేవో యంత్రము లతనికిఁ గానిపించెను. 'ఇది
ముద్రాశాల. రేయి యిం దెవరును నుండరు. నే నిందు సుఖ
ముగా నిదురింపవచ్చును' అని తలఁచి యతఁడు లోనికిఁ
జనెను. తలుపుల కీవల ఱాతియరఁ గొకటి కానిపించెను.
'మేలు మే' లనుకొని, కాళ్లు జాఁపుకొని యతఁడందు శయ
నించెను. ''అచటఁ బడుకొనినవా రెవరు?'' అని అతని
కొక ప్రశ్న వినవచ్చెను. 'ఓరి దేవుఁడా! ఇచటఁ గూడ
నదేమాట!' ఇటులనుకొను నతని కొకింత కోపము వచ్చెను.
''కానఁబడుటలేదా? నే నొక మనుష్యుఁడను'' అని యత

ననెను. “ఆ సంగతి తెలియునుగాని యంతమాత్రమున నిక్కడ నేల పడుకొనవలెను?” అని పలుకుచు నొక ముదియ యందఱికి వచ్చి—“నాయనా! చలి. అందును ఇది ఊరి చురఁగు” అనెను.

“పందొమ్మిదేండ్ల నుండి నాకిదే యలవాటు.”

“అటులా? నీ సంగతి తెలిసెను. నీ వేదేని పూఁట కూళ్ళయింటికిఁ బోకపోతివా?”

“డబ్బేదీ?”

“అయ్యో! ఏమియు లేదా? ఇదిగో నాకడ నొక ఫ్రాంకు * ఉన్నది. ఈయనా?”

“ఊఁ.”

ఆ ముదుసలిది ఫ్రాంకు నీయఁగా నతఁడు తీసికొనెను.

“నాయనా! నీ కీ ఫ్రాంకు కెవరును అన్నముపెట్టరు గాని యాచించి చూచినచోఁ దప్పు లేదుకదా?”

“పలుచోట్లకు వెళ్ళితినమ్మా.”

“వెళ్ళితివా?”

“ఆఁ. అందఱు నన్ను వెళ్ళగొట్టిరి.”

“అదిగో ఆ పెద్దయిల్లు, కనఁబడుచున్నదా?”

“అదియా?”

“ఆఁ. అక్కడికి వెళ్ళిచూడు.”

“మంచిది” అని అతఁడు మూటయుఁ, గఱ్ఱయుఁ దీసికొని నిలువఁబడెను.

---

* ఫ్రాంకు — ఇప్పటి ఫ్రాంకుకు సుమారు రెండణాల విలువ; ఆ ఫ్రాంకులను నాఁటికి సుమారు తొమ్మిది అణాలు.

## ౨

ఆ పట్టణమున మిరియేలు అనునతఁడు బిషప్పుగా నుండెను. "బిషప్పు" అనఁగా ఏసుధర్మము తెలిసిన యాచార్యుఁడు. ఆయన నీ పత్తనమునకుఁ దొలుత బిషప్పుగాఁ బంపి నపుడు రాజాజ్ఞచే ధర్మాచార్యులకుఁ దగిన గౌరవము జరిగెను. వారి కొక ప్రాసాదము. మేజర్ జనరల్ తరువాత మేజర్ జనరలంత పదవి. ధర్మాచార్యుని ప్రాసాదము చాలఁ బెద్దదే కాక సుందరమయినది. అచటి ఆసుపత్రియో ఒక అంతస్తు గల చిన్నయిల్లు. దాని నంటి యొకతోఁట యున్నది.

తా నచటికి వచ్చిన మూన్నాళ్ళకతఁ డా యాసుపత్రినిఁ జూడఁబోయెను. రోగుల కది చాల నిఱుకుగా నుండెను. అతఁ డా రోగుల నందఱను దన ప్రాసాదమునకును, దనకుటుంబము నీ యాసుపత్రికిని వెంటనే మార్ప నిశ్చయించెను. దానికి ఫలముగా నతఁడిపు డీ చిన్నయింట నివసించుచుండెను.

ఆయన తన గుఱ్ఱపుబండిని గూడ ధర్మము చేసెను. అట్లని యాయన పొరుగూళ్ళకుఁ బోయి ప్రజలకు దర్శన మొసఁగుట మానలేదు. ఎంతకష్టమగుదారి యయినను నాయన నడచియే పోవుచుండెను. వారు పోవలసిన స్థలములు రమారమి 348. వారికి సుమారు 75 ఏండ్లు. ఆయన చాలఁ గాలమునుండి యేదో యొకగ్రంథము రచించుచుండెను. అతఁడిపు డా రచనలో మునిఁగి తేలుచుండెను.

ఎనిమిదిగంటలాయెను. భోజనవేళ యగుటవలన

ఆయనచెల్లెలు వెండిపళ్లెము మొదలగు వస్తువులు తీసికొని పోవుట కక్కడికి వచ్చెను. అది చూచి మిరియేలు భోజన శాలలోనికి వెళ్లెను. అచట నున్న ముదుసలిదాసి యతని చెల్లెలితో "అమ్మా! మాపటివేళ నే నంగడికిఁ బోతిని. పట్నములోని కొక చెడ్డమనుష్యుఁడు వచ్చెననియుఁ, దలుపులు, గిటికీలు గట్టిగా గొడియలు వైచికొనవలసిన దనియు నందఱు చెప్పుకొనుచున్నారు" అని చెప్పుచుండెను.

"ఏమిటది?" అని మిరియే లడిగెను.

"దేవరా! యీ యిల్లు గట్టిదికాదు. తాము నా కానతి యిడుచో నిపుడెపోయి వడ్రంగిని బిలిచి, వాకిటితలుపులకు గడియ యెత్తింతును. అతని కిది యొక చిటిక పని. ఈ రాత్రియే తప్పక యీపని చేయింపవలయును. నెట్టినంతమాత్రమున బుడింగుమని తలుపులు వచ్చుట మేలుకాదు. ఎంతరాత్రియైనను, ఎవరు వచ్చినను తమరు 'లోనికి దయచేయుఁడు, లోనికి దయచేయుఁ'డని యనుచుందురు" అని చెప్పుచుండఁగా తలుపులు నెట్టిన చప్పుడు వారికి వినఁబడెను.

"అయ్యా! లోనికిదయచేయుఁ"డని ఆచార్యుఁడ నెను.

జీన్ వాల్ జీన్ లోపలికివచ్చెను. ఆ ముదిదాసి యతని వాలకమును జూచి భయపడుటకుఁగూడ భయపడిపోయెను! ఆచార్యుని చెల్లెలుగూడ మొదట బెదరెనుగాని తనయన్నను జూచి ధైర్యము తెచ్చికొనెను.

అతఁ డేల వచ్చెనో యాచార్యుఁడు అడుగఁబోవు నంతలో వాల్ జీన్ "అయ్యా! నన్నుఁ జూచి భయపడకుఁడు. నేను ఖైదీనయినను మానవుఁడనే. పందొమ్మిదేండ్లు

చెఱలోనుంటిని. ఇపుడే నన్నువదలిరి. నేఁడు మూఁడామడల పై చిలుకు నడచివచ్చితిని. కడుపు మలమల మాఁడుచున్నది. పూఁటకూళ్ళ యిండ్లన్నియు గాలించితిని. వారు నాకుఁ జోటివ్వలేదు. మఱియొక గేస్తు మంచినీరయినను పోయలేదు. ఆ యరుఁగుమీఁదఁ బడుకొనఁగా నా యమ్మ యీ యిల్లు చూపెను. అంత నిటకు వచ్చితిని. తమదయ'' అని తన సంగతి గడగడ చెప్పుకొనెను.

ముదుసలి దాసి యన్నమున కేర్పాటుచేయుచుండఁగాఁ జూచి యాచార్యుఁడు ''అమ్మా! వీరికిఁగూడ నాతో పాటు వడ్డింపుఁడు'' అని యనెను.

''వద్దువద్దు. అటులవద్దు. నేను ఖైదీనని చెప్పలేదా? నే నిపుడే చెఱనుండి వచ్చితిని. నా కింత మరియాద యేల?'' అని జీన్ వాల్ జీన్ అని, జేబునుండి యొక పచ్చని కాకితమును దీసి—''అయ్యా! ఇది నా విడుదలచీటి. చూతురా? దీని వలననే నా కెవరును జోటీయరు. దీనిఁ జదివికొందురా? పోనిండు. నేనే చదివి వినిపింతును. నా కోనమాలు రావు కాని చెఱసాలలోఁ గొలఁదిగా నేర్చుకొంటిని. వినుఁడు: 'పేరు...జీన్ వాల్ జీన్. ఊరు...ఊఁఊఁ. ఫలానా'...ఇది యంతయు నెందులకుఁగాని అసలుసంగతి చదివెదను— '19 ఏండ్లు చెఱసాలలో నుండెను. దొంగతనము చేయుట వలన ఐదేండ్ల శిక్షపొందెను. నాలుగుసారులు తప్పించుకొని పోయినందులకు మఱి పదునాల్గేండ్లశిక్ష. ఇతఁడు కడుఁ జెడ్డ వాఁడు.' వింటిరా? దీనివలననే నా కెవరును జోటీయరు. తా మీయఁగలరా? నాకు చెడ్డ ఆఁకలిగా నున్నది. కనులు

తిరుగుచున్నవి. నిలువఁగల ఓపిక లేదు" అనెను.

"మీరు కూరుచుండుఁడు" అని ఆచార్యుఁడని దాసిని బిలిచి—"అమ్మా! ఆ గదిలో వీరికి మెత్తవేయుము" అని యనెను. ఆ మాట విని దాసి పక్క వేయుటకు వెళ్లెను.

జీన్ వాల్ జీన్ కవళిక మారెను. అతఁడు పట్టరాని సంతోషముతో మాటాడలేక గ్రుడ్లు పెట్టుకొని చూచి తుదకు, "అయ్యా! నాకు నిక్కముగా నన్నమిడుదురా? పడుకొనుటకుఁ జోటిత్తురా? అయ్యా! మీరు నావంటి చెడువానిని 'మీరు మీరు' అని మన్నింతురేల? నేను ఖైదీనే!" అని కొంచెమునే పాచార్యునిఁజూచి "అయ్యా! మీరు నన్నుఁ గెంటింతురనుకొంటిని. అందువలననే నా నైజము నేఁ జెప్పుకొంటిని. తమకు దయపుట్టెను. రెండు మెతుకులు దొరకెను. పందొమ్మిదేండ్లు నేను పక్కమొగ మెఱుఁగను" అని చెప్పుచుండఁగా నతని కనులవెంబడి బొటబొటమని వానకురిసెను.

ముదుసలి దాసి వచ్చి వెండి కంచములును, వెండి చెంచాలును పెట్టెను.

"చలికి మీ చేతులు కొంకరపోవుచున్నవి. నెగడి దాపుగా మీకు చోటుచేయింతును" అని ఆచార్యుఁడనెను. "అయ్యా! తాము నన్ను 'మీ'రని సంబోధింపవలదు" అని జీన్ వాల్ జీన్ వేఁడుకొనఁగా నాచార్యుఁడు నవ్వెను. "ఈ దీపము తెలివిగాలేదు" అని ఆచార్యుఁడనఁగనే దాసి రెండు వెండి దీపస్తంభములు తెచ్చి కంచముల ప్రక్క నునిచెను. "అయ్యా! నాకీ గౌరవము చూపి నన్ను సిగ్గిలఁజేయవలదు. నేను ఖైదీని" అని వాల్ జీన్ అనెను.

ఆచార్యుఁ డతని దాపునఁ గూర్చుండి యతనిచేతిని దనచేతఁగొని, "మీరెవరో చెప్పుటచే వచ్చినదియుఁ, బోయినదియులేదు. ఈ యిల్లు భగవంతునిది. దీనుల కీ యిల్లెపుడును దెఱచియుండును. నాకుఁ దమపేరితోఁ బనిలేదు. మీ కేదో యొక పేరుండునని నాకు లోఁగడనే తెలియును."

"తెలియునా? నా పేరు తమకుఁ దెలియునా!"

"ఆఁ, తెలియును. మీరు నాకు సోదరులు."

నోట మాటరాక వాల్‌జీన్ తలవాల్చుకొని కొంతసే పుండి, పిదప—"అయ్యా! ఇంతకుముం దాఁకటి కాఁగలేక తూలుచుంటిని. ఇపుడు దానిమాటయే మఱచితి" ననెను.

ఆచార్యుఁ డతని మోముఁగాంచి "పాపము. నీవు చాలఁ గష్టము లనుభవించినటు లున్నావు" అని యనెను.

"నే ననుభవింపని కష్టమేలేదు. నాకన్న వీథిలోని కుక్కయు నయము. ఇఁక నీ మాటలతో నేమి లగ్గు? 19 ఏండ్లు పాలలోఁబడిన బల్లినయితిని" అని వాల్‌జీన్ అనెను.

దాసివచ్చి అన్నమును, వ్యంజనములను బెట్టెను. వెంటనే మాటలాఁగెను. జీన్‌వాల్‌జీన్ పోక్కెలువలె కుంభ ముమీఁది కెగఁబడెను.

భోజన మయినతరువాత నాచార్యుఁ డొక దీపమును చేతఁబుచ్చికొని అతనిని పడుకకుఁ దీసికొనిపోయెను. ప్రార్థన చేయు గదిలో నీ యతిథికి మంచము. మంచమున కీవల నొక తెర. ఆచార్యుఁడు శయనించు గదినుండియే యీ గదిలోనికి దారి. వారట కేఁగుతఱిలో దాసి వెండిసామానులను గడిగి, తుడిచి గూఁట నిడుచుండెను. అతిథి యీ మంచ

మును, దానిమీఁది పఱుపును, దుప్పటమును జూచి నివ్వెఱ గొనెను. అతఁ డెన్నఁ డీ భాగ్యము నొందలేదు. మంచము ప్రక్క బల్లమీఁద నాచార్యుఁడు దీపముంచి, "ఇఁక దీనిపై శయనింపుఁడు. మీకు నిద్రాభంగ మెవరును జేయరు. రేపట మీరు వెళ్లునపుడు పాలుత్రావి పొండు. ఈ దేవమందిరమున కావులున్నవి. నేను పాలు కొననక్కఱలే" దనెను.

ఈ మాటలు విని జీన్ వాల్ జీన్ నమస్కరించి తటాలున లేచి ఆచార్యుని చేతులు పుచ్చుకొని యొక యూఁపూఁపి—"నన్ను మీపడుకగది ప్రక్కనే పండనిచ్చుచున్నారా? మీ కిసుమంతయు భీతిలేదా?" అని యడిగెను. అతఁ డిటు లడిగి కొంచెమాఁగి వెఱ్ఱిగానవ్వి "నన్నిటఁ బడుకొనఁబెట్టుట తగునో తగదో లెస్సగ నాలోచించితిరా? నేను మిమ్ముల మెడ పిసికి చంపివేసినను చంపివేయఁగలను. మిమ్మెవరు రక్షింపఁగలరు?" అని యనెను.

ఆచార్యుఁడు మృదువుగా నవ్వి—"నాయనా! ఆ యాలోచన నాకేల? ఈ ప్రపంచము నంతయు నెవ రాలోచింతురో వారి దాపని" అని, పిదప భగవంతుని భావించి, అంతట నఱచేతి నతని తలమీఁద నానించి యాశీర్వదించెను. అతఁ డిందులకు కృతజ్ఞత చూపక, నమస్కారమును జేయక గోడకుఁ దిరిగి శయనించెను. ఆచార్యుఁడు మరలఁ బ్రార్థించి తెరవైచి తోఁటలోనికిఁ జనెను.

రాత్రి భోజనమయిన పిదపఁ దోఁటలోఁ గొంచెము సేపు తిరుగాడు టతని కలవాటు. జీన్ వాల్ జీన్ మిగుల నలసి యుండుటచేఁ గన్ను మూయఁగనే యతనిపై నిదుర వాలెను.

ఆచార్యుఁడు నడిరేయి పడుకగదిలోనికి వెళ్లెను. కొలఁది కాలములోపలనే యా యిల్లంతయు నిదుర పోయి నటు లాయెను.

జీన్ వాల్ జీన్ కుఁ జెఱసాలలో బల్లమీఁదనో, లేక ఱాతియరఁగుమీఁదనో పడుక. ఇపు డీపఱుపు మెత్తగానుండుట వలనఁగాఁబోలు, నతనికి రెండుగంటలపుడు మెలఁకువవచ్చెను. అపు డతనికిఁ జిన్ననాఁటినుండి నేఁటివఱకు పడిన శ్రమ లన్నియు గుఱుతు వచ్చెను. అతనికి బడలిక పోయెను. లేచి కూర్చుండెను. అతని కపుడు వెండిసామానుమీఁదికి మనసు పోయెను. అవి సుమారు 350 ఫ్రాంకులు చేయవచ్చును. చెఱసాలలో 19 ఏండ్లు చేసినకష్టమునకు 171 ఫ్రాంకులు దొరకెను. ఇపుడొక నిమిషములో దానికి రెట్టి!

ఇటు లతఁ డాలోచించుచు నొకగంటసేపు కూరు చుండెను. తుద కేమి తోఁచెనో గబాలున బూట్సులు విడిచెను. మరల మంచమున దొరలెను. ఇంతలో గడియారము మూఁడుగంటలు కొట్టెను. అతఁడు మెల్లగా గవాక్షము తెఱచి చూచెను. చిన్నచిన్నమబ్బు లడ్డము వచ్చిపోవుచుండుటచే వెన్నెల మసకమసకగా నుండెను. వాల్ జీన్ ఆ కిటికీని తిన్నగా పరీక్షించెను. దానికి ఇనుపయూఁచలు లేవు. దానిని దెఱచినచో అడ్డులేకుండఁ దోఁటలోనికి దుమికిపో వచ్చును. తోఁటచుట్టు నున్నది పిట్టగోడ. కాలు వేసి దానిని దాఁటవచ్చును. దాని కావల రాదారి.

అతఁ డిది యంతయుఁ జూచుకొని తనపడుక కడ కరిగి మూట విప్పి యొక యినుపచువ్వతీసెను. దాని కొన

వాడిగానుండెను. అతఁ డంత తన బూట్సులను జేబులో కుక్కుకొని బాణాకఱ్ఱను కిటికీ కానించెను. తలమీఁది టోపిని ముందులకు లాగుకొనెను. పిల్లివలె నడుగులు పెట్టుకొనుచు నాచార్యునిగదిలోని కరిగెను. అచట నూరుపు బిగఁబట్టి చెవియొగ్గెను. ఎచటనేని చప్పుడులేదు. అతఁడినుపయూఁచతో తలుపు నెట్టెను. లోపల గడియలేని యా తలుపు విడెను. రెండవ తలుపుగూడ నెట్టెను. దాని తికిడీలు తుప్పుపట్టుటవలన నది కంయిమనెను. అతఁడు గడగడలాడెను. అతని గుండియలు దడదడ గొట్టుకొనెను. ఆ ధ్వని కింటివారు లేచి 'దొంగలు దొంగ'లని కేకలు వేయుదురనియు, నూరివారందఱు లేచి పరుగెత్తుకొని వత్తురనియు, పోలీసులువచ్చి తనను బంధింతు రనియు నతఁడు తలఁచెను. ఇటులు తలఁచుచు నతఁడు వెనుకముందుల కడుగిడ జంకెను. కొంతసేపటికి గుండె దుడు కాఁగెను. ఆచార్యుఁడు లేవలేదు. వెన్నెల యతనిమీఁదఁ బడుటవలన మూసిన యతనికనులును, తెల్లని వెండ్రుకలును, శాంతమయిన మోమును చక్కఁగాఁ గానిపించుచుండెను.

అపుడు వాల్‌జీన్ కేమి యూహలు తట్టెనో తెలియదు. చెఱనుండి కశ్మలమగు మదితో నతఁడు బయటఁబడెను. లోకులకు చేతనయినంత యపకారము చేయఁదలఁచుకొనెను. కాని అన్నము పెట్టి పక్కయిచ్చి మాటలచే శ్రమ పోఁగొట్టిన యీ మహాపురుషుఁడా వెన్నెలలో నతనికెంతయో పవిత్రుఁడుగాఁ గనిపించెను. ఆ యినుపయూఁచతో నాతని తల మొత్తవలెనో, లేక యాయనపాదము

లో_త్తవలెనో యతనికి తోఁచలేదు. కాని అతఁడీ రెంటిలో నేదియుఁ జేయక ముంగాళ్ళమీఁద కిటికీకడ కేఁగెను. దానఁగల వెండిసామానుబుట్ట దీసికొని తన పడుక కడకు వచ్చెను. తన సామగ్రినంతయుఁ గై కొని కిటికీనుండి తోఁటలోనికి దిగెను. బుట్టనుండి వెండిసామాను తీసికొని, బుట్ట నచటఁ బాఱవయిచి, తోఁటతుదకుఁ బరువె_త్తి, పులి వలెఁ బిట్టగోడ దుమికి పాఱిపోయెను.

సూర్యుఁ డుదయించెను. అలవాటు చొప్పున నాచార్యుఁడు తోఁటలోఁ దిరుగుచుండెను. అపుడు ముదుసలిదాసి భయముతో నాతనికడకుఁ బరుగెత్తుకొనివచ్చెను.

"భగవానుఁడా! వెండిసామానుల బుట్ట కనఁబడ లేదు. మీ రెఱుఁగుదురా?"

"ఆఁ."

"అమ్మయ్య! అది నాకుఁ గనరాలేదు. నాగుండెలు కొట్టుకొనెను."

ఆచార్యుఁ డాబుట్ట నిపుడే పూలమొక్కలలోఁ జూచెను. "అదిగో! అచట నున్నది" అని చెప్పెను.

"అది ఉ_త్తది. కొంప పోయినది! వెండిసామా నే మయినది?"

"ఓహో! దానిసంగతి నే నెఱుఁగను."

"వాఁడే ఎత్తుకొనిపోయియుండును" అనుచు నా దాసి ప్రార్థనామందిరమునకుఁ బరుగిడెను. ఆ బుట్ట పడుట వలన నొకపూవు తునిసెను. దానిమీఁదికి వంగి యాచార్యుఁడు చూచుచుండెను. ప్రార్థనామందిరమున జీన్‌వాల్

జీన్ లేఁడు. వాని సామానొకటియు లేదు. దాసి మరలఁ దోఁటలోనికి వచ్చి యడుగుజాడలఁ జూచెను. పిట్టగోడ వఱకు అడుగుజాడ కనిపించుచుండెను. దాసి తిరిగివచ్చి యా సంగతి యాచార్యునకు మనవి చేసెను.

ఆచార్యుఁడిటులనెను: "ఆ వెండిని నే నుపయోగించుకొనుట తప్పు. అది పేదవారిది కాని నాదికాదు. మనమింక కొయ్యచెంచాలను, కొయ్యగిన్నెల నుపయోగించుకొందము."

ప్రాతరాహారమునకు వేళయాయెను. "పాలకు గిన్నెలేవి?" అని దాసి యనెను. "ఆకు దొప్పలతో సరిపుచ్చుకొందము" అని ఆచార్యుఁడు నుడివెను. ఇందుల కాతని చెల్లెలేమియు ననలేదు కాని దాసి మాత్రము గొణుఁగుకొనెను. వారు లేవఁబోవు సమయమునఁ దలుపు చప్పుడాయెను.

"లోనికి దయచేయుఁడు" అని యాచార్యుఁడనెను. మూవురు పోలీసులు వాల్‌జీన్‌ను పట్టుకొని యాచార్యుని ముంగలికిఁ గొనివచ్చిరి. వారిలో నొకఁడు—"స్వామీ!..."

మిగుల ఖేదముతోఁ దల వంచుకొనియున్న వాల్‌జీన్ అపు డాశ్చర్యముతో నాచార్యుని దెసఁ గాంచి—"ఈతఁడు సామాన్యోద్యోగి కానటు లున్నాఁడు" అని మెల్లగా ననుకొనెను.

"ఇసీ! నీ కెటులు మాటాడవలెనో తెలియదు. 'ఈతఁడు' అని అనరాదు. 'స్వామీ' యనిగాని 'దేవరా'యని గాని 'భగవానుఁడా' అనిగాని వీరిని సంబోధింపవలె" నని పోలీసు బందీని హెచ్చరించెను.

ఆచార్యుఁడు వడిగా వాల్‌జీన్ కడకు వచ్చి—

"ఓహో నీవా? మరల వచ్చుట మేలేయైనది. ఆ రెండు వెండి దీపస్తంభములంగూడ నీ కొసంగితిని. నీ వేల చేకొనకపోతివి? అవి రెండువందల ఫ్రాంకులు పలుకవచ్చును" అనెను.

వాల్ జీన్ ఆచార్యుని వంక నొకచూపు చూచెను. దానికి భాషలేదు.

"భగవానుఁడా! మేము పొరబడియుండవచ్చును. ఈతఁ డీ వెండిసామానుతో బెదురుచు బెదురుచుఁ బోవుచుండెను. మా కనుమానము కలిగి పట్టుకొంటిమి. దేవర తన కిచ్చినటు లితఁడు చెప్పెఁగాని మేము నమ్మలేదు" అని పోలీసు లనిరి.

"ఔను. పొరపాటు జరిగినది. ఇతనిని విడువుఁడు. మీ కందఱకును మేలు కలుగుఁగాక" అని ఆచార్యుఁ డనెను.

అంతట పోలీసులు వెళ్ళిపోయిరి. ఇంటఁగల యాఁడువారు ఱిచ్చపడిరి. ఆచార్యుఁ డపు డింటిలోనుండి వెండి దీపస్తంభములు తెచ్చి వాని కొసగెను. యంత్ర చాలితుని చందముగా వాల్ జీన్ వానినిఁ గొని వడవడ వడఁకెను.

"తమ్ముఁడా, కలవరపడకుము! నిశ్చింతగా వెళ్లుము. ఇంకొకతూరి యిటకు రానెంతువేని యీ తోఁటయంతయు చుట్టిరావలసిన పనిలేదు. వాకిటి తలుపులకు గడియయుండదు" అని యాచార్యుఁ డనఁగా వాల్ జీన్ కు మూర్ఛ వచ్చినటు లాయెను. ఆచార్యుఁ డపుడు వాల్ జీన్ కడ కరిగి మెల్లగను, గంభీరముగను ఇటు లనెను—"ఈ ధనముతో నిఁక మంచివాఁడ నగుదునని నాకు మాట యిచ్చినటులు మఱవకుము."

వాల్ జీన్ విని యూరకుండెను. మాట యిచ్చినటు లతనికి గుఱుతు లేదు. అంతట నాచార్యుఁడు మరల "నాయనా! నీ విఁకఁ గొలఁది కాలముననే మంచివాఁడ వగుదువు. ఇఁక నెంతో కాలము చెఱుపు చేయలేవు. నీ పాప ముల నెల్ల గాలించి నేనిదె జ్ఞానాగ్నిలో వ్రేల్చితిని'' అనెను.

వాల్ జీన్ నోటినుండి యొకమాటయేని పెకలలేదు. అతఁడు తూలుచుఁ దొట్రుపడుచు నా యింటినుండి వెలుపలి కెటు లేఁగెనో దేవునకే యెఱుక.

# 3

వాల్ జీన్ రోఁజుకొనుచుఁ బరువెత్తుచుండెను. మానవుఁ డెవఁడును గనఁబడని కాఅడవి దొరకునేని యతఁడు బ్రతికిపోవును. అది యెడనుండెనో వానికిఁ దెలి యదు. కావునఁ గాన రేఁగులు తంగేళ్లుగ నతఁడు దాడు తీయుచుండెను. ఎండ యెక్కెను. అన్నవేళ దాఁటినను వాని కది తెలియలేదు. మనసులో నెన్నియో తలఁపులు చక్ర ములవలె గిఱ్ఱునఁ దిరుగుచుండెను. పందొమ్మిదేండ్లు చెఱ పడుటవలన నతనిలోని మంచితనమెల్ల మసియామెను. ఇపు డది బయటఁబడెను. 'ఈ ప్రపంచముకంటెఁ జెఱసాలయే మేలు. అచటఁ దప్పునకుఁ బారావారు తన్నుదురు. తిండియు, పడుకయు, పనియు నివి యొక నియమముచొప్పున జరుగును' అని అతని కపుడపుడు తోఁచుచుండెను. అచటనచట నడవిమల్లెల తావి యతని నాసిక కెక్కుడు పని కల్పించెను. చిన్ననాఁడు తా నా పూలమండల నఱకుకొనివచ్చు టతనికి

గుఱుతు వచ్చెను. అతఁడిస్సీయని యనుకొనెను. చిన్న నాఁటి తలఁపులును, చేఁతలును నతని కిపుడు రుచింపవు.

అతఁడా పవల్లెల్లయుఁ బిచ్చివానివలెఁ బోవుచునే యుండెను. మఱియు నతని మనోరణ్యమున నెన్నియో విషయములు బండ్లవలెఁ దిరుగాడెను. తన మొదటి తప్పు ఆఁకలిమంటకు రొట్టెముక్క దొంగిలుట. ఇసుమంత యీ తప్పునకుఁ గొండంత శిక్ష. పందొమ్మిదేండ్ల చెఱ. అటఁ జెప్పరాని బాధలు. వానిని దప్పించుకొనుటకుఁ జేయరాని రోఁతపనులు. దాన దేవుఁడు లేఁడను తలఁపు. మనుజునిలో మంచితనమే లేదను నభిప్రాయము. అటుపిమ్మట నీ యాచార్యదేవుని అంతులేని దయ. ఇవన్నియు నొకటి తరువాత మఱియొకటి లేళ్ళవలెఁ బరుగు తీయుచుండెను.

ప్రొద్దు క్రుంకఁబోవుచుండెను. వాల్‌జీన్ తిరిగి తిరిగి యొక చిట్టడవినడుమ నున్న మైదానము చేరుకొనెను. అతఁడలసిపోయెను. అచట నొక రాతిబండ కనఁబడెను. అతఁడు మూఁట క్రిందఁ బడవైచి, బాణాకఱ్ఱ నా రాతి కానించి దాని మీఁదఁ గూరుచుండెను. అతఁడు నలువైపులఁ జూచెను గాని యొకపిట్టయేని లేదు.

అంతఁ గొంతవడి కొక కుఱ్ఱవాఁడు తనలోఁ దా నేదో పాడుకొనుచు వచ్చుచుండెను. వాని వీఁపున నొక పెట్టె వ్రేలాడుచుండెను. చేతిలో చితారు. పాడుచు నూరూరు తిరిగి పొట్టపోసికొనవలె నని వాని పూనిక. వాల్‌జీన్ వానిని గాంచెను గాని వాఁడు వాల్‌జీన్‌ను గాంచలేదు. వాఁడు వచ్చి వాల్‌జీన్‌కు అడ్డముగానున్న యొక పొదలోఁ గూర్చుండి

యలసట తీర్చికొనుచు జేబులోనుండి యొక రెండుఫ్రాంకుల నాణెమును దీసి, పై కెగుర వేయుచుఁ బట్టుకొనుచుఁ, బట్టుకొనుచుఁ బై కెగుర వేయుచు నాడుకొనఁ గడఁగెను. ఇటు లతఁ డెగుర వేసి పట్టుకొనుచుండఁగా నొకతూరి జాటి యా నాణెము వాల్‌జీన్ పాదముల కడకు దొరలుకొనుచుఁ బోయెను. వాల్‌జీన్ దానినిఁ ద్రొక్కిపట్టెను. ఆ బాలుఁ డా నాణెము నడకను చూచుచునే యుండెను. అందువలన లేచివచ్చి—"అయ్యా! నాణెము నాది" అనెను.

"నీ పేరేమి?"

"జెర్వై."

"పో పో. వెంటనే లేచిపో, దెబ్బలు తినఁదలఁచు కొనని యెడల లేచిపో."

"తప్పక లేచిపోవుదునుగాని, అయ్యా! నా రెండు ఫ్రాంకుల నాణెము..." వాల్‌జీన్ తలవంచుకొని కూర్చుండెను గాని యేమియుఁ బలుకఁడు.

"అయ్యా! నా రెండుఫ్రాంకుల నాణెము నా కిండు. నేను వెళ్లిపోదును. చాలఁ గష్టపడి సంపాదించిన డబ్బు." వాని మాట లర్థము కానివానివలె వాల్‌జీన్ తలయెత్తి వాని కేసి చూచుచు నూరకుండెను. ఇంతలో నా కుఱ్ఱఁడు వాల్‌జీన్ లాగు లాగెను. అంతమాత్రమున వాల్‌జీన్ ఇనుపకాలు కదలునా?

"అయ్యా! నా రెండుఫ్రాంకులు..." అని జెర్వై ఏడ్చెను. వాల్‌జీన్ అపుడు మొగమెత్తి వానిని జూచి కఱ్ఱలాగి "నీ వెవఁడవు?" అని బెదరించెను.

"నేనే."

"నే ననఁగా?"

"నాపేరు జెర్వై అని చెప్పలేదా?"

"చెప్పితివి. చాలు. నీకేమి కావలయును?"

"నా రెండుఫ్రాంకుల నాణెము. మీరు కాలెత్తుచో నేను తీసికొందును."

కుఱ్ఱఁడు కొంచెమే యయ్యు వాల్‌జీన్‌కుఁ గినిసెను. అతఁ డిటు లడిగినను వాల్‌జీన్ కాలెత్తమిని "మీరు కాలు తీయలేరా యేమి?" అని వాఁ డనెను.

"నీ వింకను ఇక్కడనే యుంటివా? వెళ్లవా?" అని వాల్‌జీన్ ఉఱిమెను.

ఆ కుఱ్ఱఁడు బెదరి వాల్‌జీన్ మోము జూచెను. అంతట వడవడ వడఁకి దాఁడుతీయ మొదలిడెను. అతఁ డఱచుటకుఁగాని, యేడ్చుటకుఁగాని శక్తిని గోల్పోయెను. తా నెట కేఁగుచుండెనో వానికిఁ దెలియదు. చాల దవ్వు పరుగిడినపిదప దమ్ము తీసికొనుట కచట నాఁగవలసివచ్చెను. కొంతసేపటిలోనే అతఁ డడ పొడ లేకుండఁ బోయెను.

సూర్యుఁ డస్తమించెను. చీఁకటు లలముకొనెను. వాల్‌జీన్‌కు పవలెల్ల తిండిలేదు. పైఁగా ఎండలో తిరుగుడు. అతనియొడలు సలపరించెను. అంత నతఁడు లేచి నిలుచుండెను. ఏడను కదలికయు మెదలికయు లేదు. అతని చూపంతయు దవుదవులఁ బడియున్న యొక పగిలిన కుండ మీఁద లగ్నమైయుండెను. నడుమ నడుమ నతఁడు నిట్టూర్చుచుండెను. చల్లనిగాలి వీవఁదొడఁగుడు నతనికి

బాధ కలిగెను. అంత నతఁడు టోపి తిన్నగా తీసికొని బొత్తాములు లేని చొక్కాను దగ్గఱగా లాగుకొని మూట గొని ముందుల కూఁగి కఱ్ఱ నానుకొని కొంచెము జరిగి యీవల నిలఁబడెను. "ఏమి టీ తలతల? రెండుఫ్రాంకుల నాణెమా? ఇది యేడది?" అని అతఁ డనుకొనెను. అతఁడు వెనుకకు రెండు మూఁ డడుగులు వేసి మరల నిలఁ బడెను. అతని చూపు నాణెమునుండి మరలలేదు. ధగధగ మెఱయు నా నాణెము చెఱబాసి వాల్ జీన్ను కోరచూపు లతోఁ జూచుచున్నటు లుండెను. అంతలో నతఁ డేమను కొనెనోగాని ముందులకు వంగి వడఁకుచు నాణెమును దీసికొని నలుదెసలఁ జూడఁగడఁగెను. ఎవరును లేరు. చీఁకటి యెక్కుడగుచుండెను. చలిగాలి రేఁగెను. అతఁడు జెర్వై పోయిన దిక్కును లక్ష్యముగాఁ బెట్టుకొని యుఱికి చూచెను. ఎవరును లేరు. అతఁడు ఎలుఁగెత్తి "జెర్వై!" అని అఱ చెను. మాఱు పలుకు లేదు.

వాల్ జీన్ మరల నఱచి చెవులు ఱిక్కించుకొని నిలువఁబడెను. ఎవరును బలుకలేదు. ఎక్కడను మనుష్య సంచారము లేదు. ఆ చిమ్మ చీఁకటిలో కన్నుగాని, ఆ యడవిలో పిలుపుగాని నిష్ఫలము. గాలి యింత చల్లఁదన మును గొనివచ్చి మేనికిఁ బులిమి యతనిని గడగడ లాడించెను. మరల నతఁడు వడివడిగా నడచిపోఁ దొడఁ గెను. అతఁడు నడుమ నడుమ నాఁగుచు "జెర్వై!" అని అఱచుచుఁ బ్రత్యుత్తరము లేమి, మరల ముందరికి నడచు చుండెను. "ఈ కుఱ్ఱవాఁడు భయముచే మాఱాడకుండి

యుండును. లేక భయముచేఁ జాలదూరము పోయియుండ వచ్చును'' అని వాల్ జీన్ అనుకొనెను.

అపు డొక పురోహితుఁ డొక గుఱ్ఱముమీఁద నా దారినే వచ్చుచుండెను. వాల్ జీన్ వాని కెదురుసని, నమస్కరించి—"అయ్యా! తమకుఁ బది పండ్రెండేండ్ల కుఱ్ఱవాఁ డెవఁడయినఁ గానవచ్చెనా?'' యని యడిగెను.

"లేదు."

"వాని పేరు జెర్వె."

"ఐయుండునుగాని నాకెవరును గనఁబడలేదు'' అని యతఁ డనెను.

వాల్ జీన్ వెంటనే తనజేబునుండి కొన్ని ఫ్రాంకులు తీసి—"అయ్యా! వీనిని బీదల కిండు! ఆకుఱ్ఱనికి పది పండ్రెండేండ్లుండును. వీఁపున హార్మనీపెట్టె, చేతఁ జితారను ఉండును'' అనెను.

"వద్దు వద్దు. నే నాతనిఁ జూడలేదు."

"పోనిండు. ఈచుట్టుప్రక్కల జెర్వె అను కుఱ్ఱ వాఁడు కలఁడా?''

"ఆవేషవాఁ డీప్రాంతముల నున్నటులు గుఱుతు చాలదు. వాఁ డెవఁడో శాటసారిపై యుండును. పలు చోటులవారీదారిగుండ పోవుచుందురు.'' వాల్ జీన్ మఱి కొన్ని ఫ్రాంకు లెత్తిపట్టుకొని "అయ్యా! పేదలకిండు'' అనెను. వెంటనే మరల నతఁడు—"అయ్యా! నేను దుష్టుఁడను. దొంగను. నన్ను చెఱపట్టుఁడు'' అనెను.

పురోహితుఁ డీనట్టడవిలో నొక పిచ్చివానితో కాల

వ్యయము చేసికొనక గుఱ్ఱము నదలించెను. అది దౌడు తీసెను.

వాల్‌జీన్ తాను బోవుచున్న దారినే పోవుచుఁ బోవుచు "జెర్వై!" అని కేకలు వేయుచుండెను. మాఱు పలుకు లేకపోఁగా నెవరును నతనికిఁ గానరాలేదు. చిన్నచిన్న చెట్లను జూచి జెర్వై అనుకొని యతఁడు దాపులకుఁ బోయి చూచి, చిన్నబుచ్చుకొని మరల మార్గమునకు వచ్చెను. ఆమార్గము పోవఁగాఁ బోవఁగా త్రిశూలమువలెఁ జీలెను. అపుడు చంద్రోదయ మాయెను. వాల్‌జీన్ మరలఁ గుఱ్ఱ వానినిఁ బిలిచెను. అతని ధ్వని దిగంతములవఱకుఁ బోయెను గాని ప్రత్యుత్తరమునుమాత్రము తీసికొని రాఁజాలకపోయెను.

అంత నతనికి బల ముడిగెను. కూయిడుటకుఁ గాని, నడచుటకుఁగాని, కాళ్లమీఁద నిలువఁబడుటకుఁగాని శక్తిలేక పోయెను. అచట నొక చట్రాయి కానిపించెను. అతఁ డెట్టెటులో దానిమీఁదఁ గూలఁబడెను. అనుతాపముచేతను, శోకముచేతను నలిఁగి నలిఁగి జుట్టు పీఁకుకొనుచు నతఁడు "నేను కిరాతుఁడను, పరమ కిరాతుఁడ" ననుకొనెను. పందొమ్మిదేండ్లకిపు డొక్కమా ఱతఁడు పెద్దపెట్టున నేడ్చెను.

ఆచార్యుని యింటినుండి పరువెత్తుకొనిపోయి ఊరి వెలుపల గాలి పీల్చుటకు నిలిచినపు డతని కే మార్పు కలిగెనో అతనికిఁ దెలియదు. 'నీ వికఁ గొలఁది కాలము లోనే మంచివాఁడ వగుదువు. ఇఁక నెంతో కాలము చెఱుపు చేయలేవు. నీ పాపముల నెల్ల గాలించి నే నిదె జ్ఞానాగ్నిలో ప్రేల్చితిని' అను నీమాట లాతని చెవిలో మ్రోఁగఁదొడఁగెను.

"పాపములు చేసిచేసి దేవుని దయ బడయుచో నా పాపికి గరువము కలుగవచ్చును. అంత నతఁడు మరలఁ బాపాలకు భైరవుఁడు కావచ్చును." ఈరీతిగా నతని మనస్సులో దేవాసురయుద్ధము చెలరేగుచుండెను.

అతఁ డిపు డిటులు నోరార నేడ్చినపిదప మనో భారము తగ్గెను. 'నే నిఁక మంచివాఁడ నెటులగుదు' నని యతఁడు వగచెను. 'ఈ ప్రపంచమున నిఁక నేమి చేయవలయును? ఎటులు జీవింపవలయును? ఈ మనుష్యు లందఱును సోదరులేకాని పులులును సింగములును గారు' అని యతఁ డనుకొనెను. "ఐపోయిన దైపోయె. ఇపు డీ కుఱ్ఱవాని రెండుఫ్రాంకులు ఏల తీసికొంటిని? చెఱసాలలో పుట్టిన బుద్ధి యిది. నేను దీనిని దీసికొనవలయునని తీసికొనలేదు. నాలో నేదో యంత్రమున్నది. ఇది దాని పని" అని యతఁ డనుకొనెను.

ఏపాటి చెడుపని యనినను అతనికి విరక్తికలిగెను. అతనిలో దొంగబుద్ధి నశించెను. కావున నతఁడు తూలి పడినను లేచి "జెర్వై!" "జెర్వై!" అని కూయిడుచు నతని నెమకఁ దొడఁగెను. ఇటు లెంతయో దవ్వు వెతకెను గాని వానిజాడ కానరామి నతఁ డొకచోఁ గూలఁబడెను. ఆచార్యుఁ డొసఁగిన వెండి దీపస్తంభము లావెన్నెలలో దగదగ మెఱసెను. అతని మనస్సుగూడ తళుక్కున మెఱసెను. అతని కనులు మూఁతలు పడెను. వాల్‌జీన్ మనస్సులో దూరదూరముగా నొక వెలుఁగు ఉదయించెను. ఆ వెలుఁగు వేఁడివెలుఁగువలెఁ జీఁకటులఁ జీల్చి దారి

చూపఁ దొడఁగెను.

అతఁ డటనుండి లేచి యెడ కేఁగెనో, యేమిచేసెనో యెరికిని దెలియదు. నాఁటి రేయి మూఁడుగంటల వేళ టుపావాఁ డాచార్యుని యింటి ముంగలినుండి పోయెను. అతఁడు—'ఎవఁడో యొకఁడు భగవద్గృహము ముందు మోఁకరించియుండఁగాఁ జూచితి' నని వక్కాణించెను.

## ౪

పరాసుదేశమునకు రాజధాని యగు పారిస్ కు దాపున 'మ...' అను నొక యూరు కలదు. అది నల్ల రంగునకును, నల్ల పూసలకును బ్రసిద్ధము.

ఐరోపాఖండమునం దొకవిధమగు రాతిని బొడిచేసి దానితో నొక నల్లరంగును జేయుచుండెడివారు. ఆ రాతికి వెల యెక్కువ. కావున నందఱును దానినిఁ గొనఁజాలక పోయెడివారు. దానివలన నా యూరివారు కొందఱు దానికిఁ బ్రతిగా నింకొక క్రొత్తరకపు నల్లరంగును తయారుచేయ మొదలిడిరి. ఈరం గసలురంగుతోఁ దులతూఁగకున్నను చౌక గాన పేదసాదలు దీనినే కొనుగోలు చేసెడివారు.

1815 వ సాలు చివర నొక క్రొత్తవాఁ డీయూరికి వచ్చి, యిం దునికి గొనెను. అతఁ డీరంగు నాకలింపు చేసికొని కొంచెము పెట్టుబడితోఁ దానుగూడఁ జేయ నారంభించెను. కొలఁది కాలములోనే కొన్నికొన్ని రసముల సంయోగముచే నతఁ డీ నకలురంగు నసలురంగుతో దీటు వచ్చునట్లు చేయఁగలిగెను. దానివలన అసలు రంగేదియో,

నకలు రంగేదియో తెలిసికొనుటకు వీలులేకుండఁబోయెను.

అతఁడు దానివెలను మిగులఁ దగ్గించెను. కూలి వారి జీతములు హెచ్చించెను. ఈ కారణమువలన నీ చిన్న యూరి యాకారము మాఱెను.

కొలఁదికాలములోనే యతఁడు చాల డబ్బు కూడఁ బెట్టెను. పనిబాగులవా రందఱును బెద్ద జీతములవలన బాగుపడిరి. అతఁ డీయూరికి సరిక్రొత్త. ఈయూ రతనికి సరిక్రొత్త. అతని యూరు నెవరు నెఱుఁగరు. అతఁ డీయూరి కెటులు వచ్చెనో, ముం దీవ్యాపారమున నెటులు దిగెనో, మిగిలిన వ్యాపారస్థులకంటె నెటు లెక్కువవాఁ డాయెనో యా సంగతి యెవరికిని దెలియదు. కాని కొంద ఱతఁ డీయూరికి కడుఁగొలఁది ధనముతో వచ్చెనని వాకొందురు. ఎవ రెటు లనుకొన్నను అతఁ డీ కర్మాగారము కట్టింపఁ గలిగినంత ధనమును దీసికొనిరాలేదనుటకు సందియములేదు. అతఁ డీ యూరికి సేద్యగాండ్ర దుస్తులతో వచ్చెను. ఇంత ధనము గడించినను ఇప్పటికిని అతని దుస్తులలో మార్పు లేదు.

అతఁడు సీతుకట్టున నీ యూరికి వచ్చెను. ఆ రాత్రియే టౌనుహాలుకు నిప్పంటుకొనెను. పోలీసు ఇన్స్పెక్టరు కొడుకు లిరువు రందుండిరి. వారిని గొనివచ్చుట కెవరికిని సాహసము లేకుండెను. అట్టి సమయములో నతఁడు వారిని బ్రతికించుటకు బగబగ మండుచున్న నిప్పులలో దూఁకెను. అందఱును 'అయ్యో, అయ్యో' అని అఱచిరి. అతఁడు వారి నమాంతముగా నీవలి కెత్తికొని వచ్చెను. అటుపిమ్మట నంద

డును 'మీ పేరేమి, మీ పేరేమి?' అని అడిగిరి. అతఁడు ఫాదర్ మాదలేను అని చెప్పెను. అతని తల యంతయు నరసెను. కన్నులు కరుణ వెల్లిగొనుచుండెను. మొగము ప్రసన్నము. కాని అతని మనస్సు విశాలము. అతఁడందఱితో నెక్కువగా గలసి మెలసి యుండెడువాఁడు. అతనికి తేపు మాపులు సికాలపోవుట యన్న నెక్కుడుఁ బ్రీతి.

అతని రాకతో పట్టణము దినదినాభివృద్ధి గాంచుచుండెను. అట్టిదిపుడు కలకలలాడు పట్టణము. అతఁడు చేసిన రంగైరోపాఖండమున నింటింటను జోరుగా నాడెను. అతని నేర్పట్టిది. పేద లందఱికును నతఁడు బ్రతుకు తెరువు చూపుచుండెను. తనకడకు వచ్చిన యాఁడువారుగాని మగవారుగాని, బాలురుగాని వృద్ధులుగాని నగుమొగములతో నుండవలసినదే యని యతనికిఁ బట్టుదల కలదేమో యని యెఱుఁగుదురు!

ఐదారేండ్లలోనే యతఁడు కొన్ని లక్షలు సంపాదించెను. గ్రామాభివృద్ధికొఱకును, దరిద్రుల సుఖము కొఱకును తనసంపాదనలో సగము ఇచ్చివేసెను. ఊరిలో ఆసుపత్రి ఉన్నదను మాటయకాని యందు మందు మాకులు లేవు. ఇపు డితఁడు దానికి వలయు ధనమిచ్చి కొందఱు వైద్యుల నేర్పాటు చేసెను. ఇపు డెందఱు రోగులకో అది ఆశ్రయ మాయెను. ప్రాంతయూరనియు, క్రొత్తయూరనియు ఆ పత్తనము ఇపుడు వ్యవహరింపఁబడుచుండెను. మాదలేను కర్మాగారము నెలకొలిపిన చోటు చుట్టును జాల నిండ్లు వెలసెను. అవి అక్కడ పనిచేయు వారల యిండ్లు. అవన్నియుఁ గలిసి యొక క్రొత్తయూ

రాసెను. అతని కర్మాగారమునకు దవ్వుగా తొల్లి యొక బడి యుండెడిది. ఆ బడి పాడుబడియుండెను. మాదలేను దానిని బాగుచేయించుటయేకాక దానికి దాపుగా మఱియొక క్రొత్త బడి కట్టించెను. ఒకటి మగపిల్లలకు; రెండవ దాఁడుపిల్లలకు. సర్కారువా రిచ్చు జీతములు చాలక పోవుటవలన నుపాధ్యాయులు వేఱు పనులచే పొట్ట పోసికొనుచు చదువు చెప్పుటకు మూలుగుచుండుట చూచి యతఁడు తన సొంత డబ్బుతో వారిజీతము లెక్కువచేసెను. అందువలన నూరిలోని పిల్లల కందఱకును చదువులు కలిగెను. ఇందుల కెవరేని విస్మితులగుచో నతఁడు "దేశమునకుఁ జదువులును, దాదులును రెండు కన్నులు సుమండీ" అని యనుచుండును. అతఁడు కుంటివారికిని, గ్రుడ్డివారికిని సాయముచేయుట కొక నిధిని, పనిబాగులవారికి వేఱుగా నొక వైద్యశాలను కల్పించెను.

మాదలే నిన్ని ధర్మకార్యములు చేసినందువలన సర్కారువా రతనికి 'మేయరు' అను బిరుదిత్తురని ప్రజ లనుకొనిరి. అది నిక్కమే యాయెను. కాని ఆ మఱునాఁడే అతఁడు "నే నీ పదవికిఁ దగను" అని మనవిచేసికొనెను.

1815 న్న శిల్పప్రదర్శన మొకటి జరిగెను. ఫాదర్ మాదలేను కొన్నికొన్ని క్రొత్తక్రొత్త శిల్పములు చేసి చూపెను. ఇట్టి విశేషము లెఱిఁగినవాఁ డగుట తెలిసి రాజతనిని మిక్కిలి సమ్మానించెను. పిదప రాజపక్షమునుండి ఆ సమ్మానముకూడ వచ్చెను. అతఁ డదియు వలదని వేఁడుకొనెను. దానితో నతనిని అధిక్షేపింపవలయునో, లేక

యాదరింపవలయునో యెవరికిని దెలియలేదు.

లోకులు తనకుఁ జేయు గౌరవమునకుఁ గృతజ్ఞత తెలుపుటకుఁ గూడ తీరికలేనన్ని పను లతనిని కాచుకొని యుండును. శత్రువుకూడఁ బ్రేమించునంత వినయాదార్యము లతనికిఁ గలవు. కర్మాగారములోని వారి కెల్లరకును అతఁ డనిన ప్రాణము. వా రతనికి నమస్కారము చేసినపు డెల్ల నతఁడు విషాదమును, గాంభీర్యమును జెందుచుండును. దేశమునందంతట నతనిపేరు మ్రోఁగఁగనే సంఘమునందును అతని గౌరవమునకు మేరలు దాఁటెను. వా రతనిని 'మసియోన్ మాదలేన్' అని గౌరవ పూర్వకముగా వ్యవహరింపఁ దొడఁగిరి. అతని పనివారు మాత్రము ఫాదర్ మాదలేన్ అనియే వ్యవహరించుచుందురు. ఆ పలుకే యతనికి సంతోషజనకము.

చుట్టుప్రక్కల యూరుల వా రంధ· అతనిని మా యూరికి రమ్మనిన మా యూరికి రమ్మని ఆహ్వానింపఁదొడఁగిరి. గొప్పగొప్ప ధనికులలో నతని ప్రతిష్ఠ వ్యాపించెను. పనిబాగుల్లవారు కూర్చుండి 'ఆ పని అటులు, ఈ పని యిటులు' అని చెప్పుకొనుచుండు ముందుగదిలో నిపుడు లక్షాధికారులు ఓలగముండి 'మీ వ్యాపారములో మేమును లక్షలు పెట్టుబడి పెట్టుదుము, మాకును వాటాలిండు' అని అతనినిఁ బ్రార్థించుచుండిరి. కాని యతఁ డీకొనలేదు. అది చూచి లోకులు—''ఇతఁడు అం అనిన ఢం అనలేఁడు. ఇతని యిల్లేడనో, వాకిలియేడనో? ముందితఁ డేడ నుండెనో, యేమి చేయుచుండెనో? ఇతనికి మర్యాద కలవారలలో

తావులేదు. వట్టి బర్బరుఁడు' అని వాపోయిరి. అతఁడు పేదలకు రెండు చేతులతో నీయఁగా వైద్యశాల మీఁద వైద్యశాలయు, బడిమీఁదబడియుఁ గట్టింపఁగాఁ జూచి ఆ లోకులే 'గొప్పవాఁ డని అనిపించుకొనుట కితఁడిటుల ధన వ్యయము చేయుచున్నాఁ' డని యనిరి. రాజు సమ్మానించి నపు డతఁ డఁదులకు నే నసస్హుఁడనని మనవిచేయఁగాఁ జూచి యా లోకులే 'వీఁడు వట్టిశుంఠ' అని యనిరి. అతఁడు దరిద్రులతో పాటు జీవిక చేయుచుండఁగా ఆ లోకులే 'యితఁడు లోభి' యని యాడిపోసిరి.

చూచుచుండఁగాఁ జూచుచుండఁగా నయిదాఱేండ్లు దొరలిపోయెను. ఈ లోపుగా నతఁడు చాల ధర్మకార్యము లొనరించెను. రాజు మరల నతనిని 'మేయరు' గా నిర్వ చించెను. ఇపుడుగూడ నతఁడు 'నే నిందులకుఁ దగ'నని చెప్పుకొనెను. కాని లోకులందఱును జేరి 'మీ రీ పని కంగీకరింపవలయు'నని పట్టు పట్టిరి. దాన నతఁ డెట్టులో సమ్మతింపవలసి వచ్చెను.

ఈధనముగాని, యీసమ్మానముఁగాని యతని మదిలో నేమాత్రము నహంకారమును చొప్పింపలేకపోయెను. అతఁ డీమూరికి నేవేషముతో వచ్చెనో నేటికిని ఆవేషముతో డనే యుండెను. ఒక మొద్దుటోపి. చీలమండలవఱకును వ్రేలాడు నొక ముతకకోటు. దానికి క్రిందినుండి మీఁది వఱకును బొత్తాములు. అతఁ డీవేషముతోడనే మేయరు పని చేసికొని సాయంసమయమున నొంటరిగా నేకాంత ప్రదేశమునఁ దిరుగాడఁబోవును. అతఁ డెవరితోడను ఎక్కు

వగా మాటలాడఁడు. తన్నెవరేని నుతించినచో నతఁ డట నుండి తొలఁగిపోవును. లేదా ప్రసంగాంతర మారంభించును. అతఁడు ప్రాణములువిచ్చి నవ్వును. భోజనవేళలో నతఁడు చదువుకొనును. పుస్తకమనిన నతనికిఁ బ్రీతి. అతని కొక చిన్న కోశాగారము కలదు. అందు మంచి పుస్తకములు కలవు. పేరు వచ్చినకొలఁది నతఁడు పని తగ్గించుకొని జ్ఞానార్జనమునకే కాలము వినియోగించుచుండెను. చదివిన కొలఁదియు నతనికి వినయమును, జాగృతియు, నమాయికతయుఁ బెచ్చుపెరుఁగఁ దొడఁగెను.

విహారమునకుఁ బోవునపుడెల్ల నతఁ డొక తుపాకిని గూడఁ బట్టుకొని పోవుచుండును గాని దాని నెపుడును నూరక పేల్చఁడు. అక్కఱ యగునేని యతని గుఱి వమ్ముకాదు. అతఁ డెపుడేని యొకపిట్టనుగాని, పెంపుడు జంతువును గాని కొట్టలేదు. అతనికి ప్రాయము పడమర తిరిగినను బలము మాత్ర ముడుగలేదు. నే నింత గొప్పవాఁడ నను గరువ మతఁ డెఱుఁగఁడు. ఎవరిగుఱ్ఱమేని క్రిందఁ బడిపోయినను, ఎవరి బండిచక్రమేని బురదలోఁ గూరుకొనిపోయినను అతఁడు బుజము వేయుచుండెడివాఁడు. బెదరిన యెద్దేని తోఁక మట్ట యెత్తుకొని అడ్డము వచ్చినవారినెల్లఁ గ్రుమ్ముచు అంకెలు వేయుచు పరుగెత్తుచుండెనేని, యతఁ డెదురుగఁ బరుగెత్తి యెగిరి దాని రెండు కొమ్ములను దన రెండుచేతులతోఁ బట్టుకొని గిరుక్కున వెనుకకు మరలించుచుండును. రస్తాపైఁ బోవునపు డతఁడు నిండుజేబులతోఁ బోయి, ఉత్త చేతులతో నింటికి వచ్చుచుండును. ఊరిలోనికిఁ బోయినపు-

డెందములో బీదలు అతనిచుట్టు మూఁగినంతటనే వారల మొగము చేఁటంత అయ్యెడిది.

ఈ యూరికి రాకముం దతఁ డెచటఁ గాఁపురముండెడి వాఁడో, యేమి చేసెడివాఁడో యది యెరికిఁ దెలియకున్నను అతని వర్తనమే యాయా సంగతులను చెప్పక చెప్పెడిది. ఏలయనిన, నతనికిఁ బల్లెలలోని సంగతు లన్నియుఁ గరతలా మలకము. అతనికి సేద్యము తెలియును. పంట లెక్కువ పండించుట తెలియును. కుటీర శిల్పములు తెలియును. వేయేల? అతఁడు బారబలావతీల పను లన్నియుఁ జేయఁగలఁడు. అతఁడు తనకుఁ దెలిసిన విషయము లొరులకుఁ జెప్పి ఉపకరించును.

"ఈ ప్రపంచములోఁ జెడ్డదేదియు లేదు; అవస్థను బట్టి చెడ్డతనము పుట్టుకొని వచ్చును" అని యెల్లప్పు డనుచుండును.

పిల్ల లతని మనసారఁ బ్రేమింతురు. అతనికిఁ బిల్లలన్న దేవరలు. అతఁడు వారి కాటకాయలును, తినుబండములు నిడుచుండును. తన చుట్టుప్రక్కల నెవరేని చనిపోవుచో నతఁడు శవసత్కారమున కగ్రయాయి. చర్చికి ఎప్పుడు నతఁడు మానఁడు. అతఁ డిటు లెన్నియో సత్కార్యములు చేయును గాని వానిని బ్రకటము చేయఁడు. అతఁడు భాగ్యవంతుఁడే కాని సుఖవంతుఁడు కాఁడనిపించును. అతనిసంగతి అద్భుతమనియు, 'చూడ దొడ్డ; మంచపుకోడు' అనియు కొందఱందురు. అతని పడకగదిలో నొక మెత్తని పఱుపుగాని, యొక వెలగల మంచముగాని లేదు. ఒకబల్ల మీఁద మాఁగువాఱిన రెండు దీపస్తంభములు కలవు. పరి

శీలించి చూచినవారు అవి వెండివని వర్ణింతురు.

1821 సంవత్సరము మొదటి దినములలో 'డి...' పత్తనమున మహానుభావుఁడగు మిరియేలు ముక్తి చెందెనని తెలిసెను. ఎనుబదియేండ్లు దాఁటిన ఆమహాత్ముఁడు ముక్తిఁ బొందుటకుముందు అంధుఁ డాయెనుగాని యుపచారము చేయుటకుఁ జెల్లె లుండుటవలనఁ గష్టములపాలు కాలేదు.

ఆసంగతి తెలియఁగనే మసియోన్ మాదలేను మిరియేలు మృతికి శోకచిహ్నముగా నల్లనిదుస్తులు తొడుగుకొనెను. లోకులు దాని కెన్నియో అర్థములుతీసిరి. ఈమాదలేనుకును, ఆమిరియేలుకును పోరాని చుట్టరిక మేదో యున్నదని కొందఱు భావించిరి. దానివలన వారికి మాదలేను మీఁద మఱి కొంచె మెక్కువ భక్తి కలిగెను. ఎవరయినను "మిరియేలు భగవానుఁడు తమ కేమి కావలెను?" అని యడుగుచో "అయ్యా! నా కేమియుఁగాఁడు" అని అతఁడు చెప్పెను. "అటులగుచో మీ రెందుల కీ నల్లదుస్తులు వేసికొంటిరి?" అని యడుగుచో "నేను చిన్నప్పుడు దేవరవారిబంటును" అని మాదలేను ప్రత్యుత్తరించెను.

✂

ఇంత లోకప్రియుఁ డయినను ఇతనికిని గొందఱు శత్రువులు లేకపోలేదు. వారిలో ఫోశెల్వాన్ అనువాఁ డొకఁడు. అతఁడు ఆయూరిలోఁ దొల్లిటినుండియు ఇంగ్లీషు వారి నల్లరంగువంటి నల్లరంగును, జర్మనీవారి నల్లపూసల వంటి నల్లపూసలను జేయుచుండెను. మాదలే నీయూరు

ప్రవేశించి ఆ రంగును, ఆ పూసలును జేయ మొదలిడిన తరువాత ఫోశెల్వాన్ వ్యాపారము పడిపోయెను. దాన నతఁ డాపని మానుకొని బండితోలుకొని బ్రతుకవలసినవాఁ డాయెను. పైఁగా వార్ధకము. మాదలేనువలననే తన కీ కష్టములు కలిగెనని ఫోశెల్వాన్ అతనికి గర్భశత్రువాయెను.

ఫాంటైన్ అను నొక యామె మాదలేనుకు పరమ శత్రువు. ఈమె ఫరాసు దేశమునకు రాజధానియగు పారిస్ కుఁ బోయి అచటఁ గొంత కాల ముండెను. ఆమె కమ్మఁజక్కనిది. బ్రతుకు తెరు వేమియులేదు. పైఁగా కోజెత్తను కూఁతురు. దానికి మూఁడేండ్లు. స్వగ్రామ మగు 'మ...'కు చేరినచో నెటులేని బ్రతుకవచ్చు ననుకొని యామె తన శిశువును మోసికొని రాఁజాలక తటపటాయించుచుండెను.

ఫాంటైన్ నివసించుచుండు నింటికి దాపున తేనార్డ్ కుటుంబము నివసించుచుండెను. తేనార్డ్ కు ఇరువురు బిడ్డలు. తేనార్డ్ యును, అతనిభార్యయును దమపిల్లలను జెముదు నెత్తురుగా సాకుచుందురు. ఫాంటైన్ అది చూచి తన బాలికను గూడ వారికి సాక నొసఁగి దానికై వారు కోరిన ధనమును పంపుచుందు నని ఒడంబడిక చేసి స్వగ్రామమును చేరుకొనెను. అచట 'నా' యనువా రెవరును లేమి ఫాంటైను మాదలేను కర్మాగారమునఁ బనిఁ గుదిరెను. తాను సంపాదించిన ధనముతోఁ దాను బ్రతికి, పైని కూఁతునుగూడఁ బోషింపవలెను. దానఁజేసి యామె మిగుల శ్రద్ధగాఁ బనిచేసి యెక్కువ జీతము సంపాదించుచు నందులోఁ జాల మిగిల్చి కూఁతుకొఱకుఁ బంపుచుండెను.

ఇది మిగిలిన పనివారికిఁ దలపోటాయెను. అందువలన వ్వా రందఱును గలిసి మేస్త్రీతో నామెమీఁద చాల చాడీలు చెప్పుచుండిరి. అతఁడు వారిమాటలు నమ్మి మాదలేనుకుఁ జెప్పకయే యామెను పనినుండి తొలఁగించెను. మాదలేనే తనను తొలఁగించె ననుకొని యామె యతనిపైఁగ త్రికట్టెను.

మాదలేనుకు పోలీసు ఇన్‌స్పెక్టరొకఁడు ఘోర శత్రువు. ఇతని కిన్‌స్పెక్టరు లందఱిలో మంచి పేరున్నది. ఏలనఁగా నితఁడు మంచివారెవరో, చెడ్డవారెవరో యిట్టే కనిపట్టగలఁడు. ఇతఁడెన్నాళ్ల క్రిందఁ జూచిన మొగముల నేని యినుమంతలోఁ బోల్చఁగలఁడు. చెడ్డవారి నందఱను న్యాయప్రకారము దండింపవలయు ననియు, నట్లు చేయనిచో వారు మంచివారు కాఁజాలరనియు నతనియూహ. ధర్మము నక్షరాల నడిపింపవలయు నని యతనికిఁ బట్టుదల.

మాదలే నీయూరఁ బ్రవేశించి ధనార్జనము చేసి పేరు ప్రతిష్ఠలు సంపాదించినపిదప జేవరిచటి కుద్యోగము నకు వచ్చెను. మాదలేను మోము చూచినంతమాత్రమున నిదివఱ కెన్నఁడో చూచినటు లతనికి సందియ మొదవెను. జేవరొకనారి వెనుక జీన్ వాల్‌జీన్‌ను జూచినమాట నిక్కమే. మాదలేనులో నతని పోలిక లుండెను. జీన్ వాల్ జీన్ చెఱబాసిన పిదప మరల నొకతూరి దొంగతనము చేసెను. కావున నతఁడే యితఁడయినచో నితనిని బట్టుకొని ధర్మమును నాలుగు పాదముల నడిపింపవచ్చును. ఇంతియ కాక జీన్ వాల్‌జీన్‌ను బట్టుకొనఁ గలిగినచోఁ దనకుఁ బెద్ద యుద్యోగము తప్పక రాఁగలదు.

మాదలేను దిక్కులేనివారికిని, దుష్టులకును ప్రాపు. ఇంత ధనికునకు, ఇంత సాధువునకు ఇట్టివారియెడ సానుభూతి యుండుటకుఁ దనలో నేదో దోషముండవలయు నని పోలీసు బుద్ధి. కావున మాదలేనుపై జేవరుకు సందియ మెక్కువ యాయెను. క్రమక్రమముగా నతఁడు మాదలేను పుట్టు పూర్వోత్తరములగుఱించి సాంగోపాంగముగా గనుఁగొనఁ దొడఁగెను. తెలిసినంతవఱకును ఎప్పటికప్పుడు తన పై యధికారుల కా సంగతులు వ్రాసి పంపుచుండెను.

ఇటు లుండఁగా నొకనాఁడు రాజవీథికి దాపుగా నొక బరువుబండి బురదలోఁ గూరుకొని పోయెను. గుఱ్ఱములిరుప్రక్కలఁ బడిపోయెను. బండివాఁడు చక్రముక్రిందఁ బడెను. అతఁడు ఫోశెల్వాఁ. జను లాబండి చుట్టును మూఁగి గుఱ్ఱముల నావలికి లాగివేసిరి గాని యెవరును బండినిగాని, ఫోశెల్వాఁనుగాని చూడరయిరి. అంతలో జేవ రచటికి వచ్చి చూచి బండి నెత్తుట కొక జాకిని తెమ్మని ప్రక్కవానికిఁ జెప్పెను. వాఁడు దానిని దెచ్చుటకు బరుగెత్తెను. "చచ్చితిఁ జచ్చితి, బండిని లేవనెత్తుఁ" డని ఫోశెల్వాఁ కూపెట్టెను.

అపుడు మాదలేను షికారు వెడలుచు జనులు రాముని దాడిగాఁ దిరుగుచుండుట కని తానును అచటి కరిగి చూచి "జాకీ యేదేని కలదా?" యని యడిగెను.

"తీసికొని రాఁబోయిరి" అని యొకరు చెప్పిరి.

"వారు తీసికొనివచ్చుట కెంతసేపు పట్టును?"

"కమ్మరకొలిమికడకు వెళ్లిరి. ఒక పావుగంటలో

రాఁగలరు."

"అంతవట్టు కనిపెట్టుకొని కూరుచుండుటకు వీలు లేదు. చక్రము దిగఁబడిపోవుచున్నది. ముసలివాఁడు పిసరు వెళ్ళి చచ్చిపోవును. ఆత్మబలమును, ఉపకారబుద్ధియుఁ గలవాఁ డెవఁడేని వెంటనే బురదలో దిగి బండి యెత్తవల యును. ఇప్పుడు వెంటనే దిగి యెత్తువానికి పది లూయీ లిచ్చె దను" (లూయీ అనఁగా సుమారు 15 రూపాయలు) అని మాదలేను ఘోషించెను గాని అందు దిగుట కెవరును సాహసింపఁజాలకపోయిరి. "ఇరువది లూయీలు" అని మాదలేను మరల ననెను. దానికిని ఎవరును గదలలేదు.

"ఉపకారబుద్ధి లేక కాదు" అని ఒకమాట విన వచ్చెను. మాదలేను మెడ మలఁచిచూచెను. జేవరు మరల నిటుల నెను—"ఈపని చేయఁగలవాఁడు నాయెఱుకలో నొకఁడే. ఒకఁడనఁగా నొకఁడే. అతఁ డొక బందాకోరు."

మేయరు ఆచి చూచెను.

"అతఁడు తులోను చెఱసాలలో......" ఈ మాట లతో మాదలేను వెలవెలబోయెను. బండిచక్రము కొంచెము క్రిందికి క్రుంగెను. "నా కూపిరియాడుట లేదు. నా ప్రక్క టెముకలు పటపటలాడుచున్నవి" అని ఫోశెల్వా౯ లబలబ లాడెను. మాదలే నొకసారి జేవరువంకను, ఒకసారి యే మియుఁ జేయఁజాలక చూచుచున్న జనమువంకను జూచి బండి క్రిందికిఁబోయి వీఁపొగ్గి రెండుసారు లెత్తెనుగాని అది కద్లని రథమాయెను. చుట్టుప్రక్కల నున్నవారందఱు "అయ్యో!

బండి మఱికొంచెము దిగిపోవుచున్నది, మీ రిఁక నీవలికి రావలయును''అని అఱచుచుండిరి. ఫోశెల్వాఁ "నేను చచ్చుచునే యున్నాను, మీ రేల యీ యాపదలోఁ బడవలెను? మీ రొడ్డెక్కుఁడు" అని మూల్గెను. మాదలేను వారి మాటలువినక దమ్ముబిగఁబట్టి 'ఊఁ' యని యొకసారి ఎత్తెను. బండి బిరాన లేచెను. అందఱును ఫోశెల్వాఁను బయటికి లాగిరి. మాదలేను ఒడ్డెక్కి నిలువఁబడెను. అతనికోటు చినిగి పోయెను. లాగు బురద యాయెను. అతని మోము చెమరోడెను. ఇంతలో ఫోశెల్వాఁ మాదలేనుముంగలికి వచ్చి మోకరించెను. అపు డతఁ డొక దివ్యబాధను విధిపూర్వకముగా ననుభవింపఁగలిగిన తృప్తితో నతని నాదరించి తనకేసి అదేపనిగా చూచుచున్న జేవరును నిర్మలముగ చూచెను.

ఫోశెల్వాన్ ఒడలెల్ల హూనహూన మాయెను. అతఁడు మాదలేను వైద్యశాలలోఁ దేరుకొనెనుగాని అతని కాలుమాత్రము సొట్టపోయెను. మాదలే నాతని పారిస్ పట్టనము తుట్టతుద నున్న యొక "కాన్వెంటు" (Convent) లో తోఁటమాలిగాఁ బనిచేయఁ బంపెను.

పని పోయినపిదప ఫాంటైను డబ్బులేక మిగుల చిక్కులపా లాయెను. తన చక్కని వెంట్రుకలను కత్తిరించి సవరములు చేయువానికిని, అందమగు ముందుపల్లుల రెంటిని ఊడగొట్టించుకొని పల్లుకట్టువానికిని అమ్మి ఆ డబ్బును తెనార్డీరుకుఁ బంపెను. అతఁ డామె చేతిసొమ్మెల్ల గుల్లగుట్టగఁ దిని ఎంతపంపినను చాలదనియు, మరలఁ బంపుమనియు వార్త మీఁద వార్త పంపుచుండెను.

ఫాంటైనుకు పని యెక్కుడగుటవలన జబ్బుచేసెను. ఇట్టిస్థితిలోఁగూడ నామె యొకనాఁడెచటనేని పని దొరకు నేమో యని యిల్లిల్లును తిరుగుచుండెను. ఆనాఁడు చలి గడగడ లాడించుచుండెను. ఒక దుర్మార్గుఁ డామెను జూచి కొప్పుకోఁతకును, పంటితీఁతకును రోసి దుర్భాషలాడి కొన్ని మంచుగడ్డలఁదెచ్చి కంఠప్రదేశమునఁ బులిమెను. ఆమె యా బాధ కోర్వఁజాలక కినిసి యాతనిటోపి లాగి క్రిందఁబడ వయిచి మట్టెను. ఇంతలో జేవ రచటికి వచ్చి యామెను బంధించెను. లోఁగడ నేమి జరిగెనో యతఁ డెఱుఁగఁడు. వేషభాషలు కలవాఁడు దుష్టుఁడు కాఁజాలఁడని జేవరు నమ్మిక. కావున ఫాంటైను పోలీసుస్టేషనుకు నడవవలసి వచ్చెను. అచట నామె కాఱునెలల శిక్ష విధింపఁబడెను. అప్పు డామె జేవరుముందు మ్రొగ్గతిల్లఁబడి—"అయ్యా! నా బిడ్డగతి యేమగును? తెనార్డీరుకు నూరుఫ్రాంకులు పంపనిచో నది చచ్చిపోవును" అని మొఱపెట్టెను. "ఆ సంగతి మాకు తెలియదు. ఆఱునెలలు నీకు శిక్ష. తెలిసినదా? మఱి మాటాడకు."

"అయ్యా! నన్ను క్షమింపుఁడు. నాకు జ్వరము. పనికొఱకు పారాడుచుంటిని. ఈ చెనఁటి యెటనుండి వచ్చెనో నన్నుఁ జూచి కాఱుకూఁతలు కూయఁజొచ్చెను. నే నందుల కోర్చికొంటిని. ఆ దుర్మార్గుఁ డీ చలిలో మంచు పులిమెను. దాన నేను కినిసి యీ పని చేసితిని. ఇది తప్పే. అతనిని క్షమాభిక్ష వేఁడుకొందును. ఈ యొక్కమాఱు మాత్రము క్షమింపుఁడు. నేను పనిపాటులుచేసి తెనార్డీరుకు

నూఱుఫ్రాంకు లంపనిచో మా యమ్మ కోజెత్తు మృతి చెందును.'' ''నీ చెప్పిన దంతయు వింటిని. నీ కాఱునెలల శిక్ష తప్పదు. ''దేవుఁడుగూడ నిన్ని శిక్షనుండి తప్పింపలేఁడు'' అని జేవ రనెను.

పోలీసుబంటు లామెను చెఱపట్టుటకుఁ బోవుచుండఁగా ''ఒక నిమేష మాఁగుఁడు!'' అనుమాట వినఁబడెను. వెనువెంటనే మాదలేను కనఁబడెను. జేవరులేచి టోపితీసి యెటులో నమస్కరించి—''అయ్యా! దయయుంచి తమ రీవిషయములో...'' అని యేమో చెప్పఁబోవుచుండఁగా ఫాంటైను నొక్కపెట్టున నెగఁబడి—''నీవా ఉద్ధారకుఁడవు?'' అని అతని మొగముమీఁద నుమిసెను.

''అయ్యా! దయయుంచి యీామెను విడుదలచేయఁ గోరెదను'' అని మాదలే ననెను.

ఇందుల కందఱును ఆశ్చర్యపడిరి. పిడుగు పడు నను శంకలో పూలు పడెను!

జేవ రామెను విడుచుటకు తటపటాయించెను. అపుడు మాదలేను ''ఈమెను వదలుఁడు'' అని అధికార పూర్వకముగాఁ బలికెను. జేవరుకు వదలక తప్పలేదు.

పిమ్మట నామెను మాదలేను తన యాసుపత్రికిఁ బంపెను. ఆమెకు జ్వర మంకాపొంకాలుగాఁ గాసెను.

ఆ మఱునాఁడు జేవరు కచ్చేరికి వెళ్లి మాదలేను ముందు చేతులు కట్టుకొని నిలువఁబడి—''అయ్యా! నేనొక పొరపాటుచేసితిని. నే నీ యుద్యోగమునకుఁ దగను. నన్నుఁ దొలఁగింపుఁడు'' అని వేఁడుకొనెను.

"అది యేమి?"

"నేనొకానొకప్పుడు జీన్ వాల్‌జీన్ యను నొక గజ దొంగను జూచితిని. అతఁడు చెఱ బాసెను గాని పిదప, మరల దొంగతనము చేసెను. మీలో నతని పోలికలున్నవి. నే నీ సంగతి పై యధికారులకుఁ దెలిపితిని.

"ఇది యిటులుండఁగా పారిస్ పట్టనమున నొకఁడు దొంగతనమునకుఁ బట్టుపడెను. అతఁడు జీన్ వాల్‌జీన్ యని తోడి ఖైదీలు చెప్పిరి. రేపా విచారణ అచటఁ గా నున్నది. పొరపాటున నేను మిమ్ములను వాల్‌జీన్ అని నిరూపించినందులకు నన్నీ యుద్యోగమునుండి యూడ్చి వేయుఁడు. ఇట్టి పొరపాటొనరించువాఁ డీ యుద్యోగమున కనర్హుఁడు" అనెను.

"ఏమీ?" అని దీర్ఘము తీసి మాదలేను—"ఆ దొంగ కేమి జరుగును?" అని అడిగెను.

"యావజ్జీవ శిక్ష."

"అబ్బా! సరి కాని తమరుగూడ విచారణ సమయమున నుండవలెను కాఁబోలు. దయచేయుఁడు."

"నన్నుఁ దీసివేయుట మాట?"

"దాని సంగతి తరువాత."

జేవరు వెళ్లిపోయెను. మాదలేను వ్యాకులతతో పనులు ముగించుకొనియు, పనులు ముగించుకొనకయు బయలుదేఱిపోయి అతి కష్టముమీఁద కోర్టు వేళకు హాజరాయెను. 'అయ్యా! దారిలోఁ బడియున్న పండ్లమండను తీసికొంటినే కాని నే నే తోటలోనికిని అడుగు పెట్టలేదు, ఏ

మండమీఁదను చేయివేయలేదు' అని ఆనిరపరాధి మొఱ పెట్టెను. పోలీసు లపుడు మువ్వురు సాక్షులను హాజరుపెట్టిరి. "ఇతఁడే జీన్ వాల్‌జీన్" అని వారు వక్కాణించిరి.

జడ్జి వారికి శిక్ష చెప్పఁబోవుచుండఁగా మాదలేను లేచి—"అయ్యా! నా దొక మనవి. అతఁడు జీన్ వాల్ జీన్ కాఁడు, మఱి నేను. నేను తులోన్ చెఱసాలలో పందొమ్మి దేండ్లుంటిని. విడుదల నైతిని. మిరియేలు భగవానుని యింట దొంగతనము చేసితిని. వారి యనుగ్రహమున నా జీవితము మాఱెను. ఆ దొంగతనమునకు శిక్ష పొందవలసిన కర్మ విధి నాకున్నది" అనెను. ఈ మాటలకు జేవరు మొదలుకొని జడ్జి వఱకు అందఱును తెలతెలఁబోయిరి.

"అయ్యా! నాకు కొన్ని పను లున్నవి. నా యునికియు నా మనికియుఁ దమ కందఱకుఁ దెలియును. తమ యాజ్ఞకు బద్ధుఁడను. సెలవు" అని మాదలేను కోర్టునుండి నిర్గమించెను.

ఆ మఱునాఁడే అతఁడు ఫాంటైనును జూచుట కాసుపత్రికిఁ జనెను. ఆమె యొడ లెఱుఁగదు. అట్టి స్థితిలో నామె మాదలేనును చూచుచునే యిటు లనెను—"ఈ రేయెల్ల నా కలలో మీరే. ఆహా! మీ తలచుట్టును ఎంత కాంతిపరివేషము! కాని అయ్యా! నా బిడ్డ కోజెత్తుమాట యేమి? మీరు దానినిఁ దీసికొనివచ్చి నాకుఁ జూపుటకే నిన్న వెళ్లితి రనుకొంటిని. తెనార్డీర్ పంపలేదు కాఁబోలు. మీ వెంట పంపుమని చీటి వ్రాసితిని. ఇదిగో తీసికొనుఁడు" అని యొక చీటి మాదలేనుమీఁదఁ బడవయిచి, "అయ్యో! మీరు తీసికొనివచ్చి నాకుఁజూపుదురని అనుకొంటిని" అనెను.

అంత వైద్యుఁ డడ్డువొచ్చి—"అది యేమి? నీ బిడ్డ ద్వారముకడ నున్నది" అని అనెను.

ఫాంటైన్ మొగ మంతయు సంతోషమయమాయెను. కాని యూంమెయూర్పులు నిలిచిపోయెను. మాదలేను భగవత్ ప్రార్థనకు మోఁకరించెను.

అపుడు జేవరు మాదలేనును పట్టుకొనుటకు వచ్చి ద్వారముకడ నిలిచియుండెను. మాదలేను లేచి జేవరును జూచి—"నే నిఁక మీ చేకొద్ది కుంచమను" అని పలికెను.

తులోన్ చెఱసాలవంటి పాడు చెఱసాల యీ జగతిలో లేదు. అట బందీలు దురదృష్టవంతులు. వారిని జతలుగా నేర్పఱచి చెటియొక కాలును గొలుసులతో నంటఁగట్టుదురు. ఆ గొలుసులతోడనే వారిచేత ఓడలలో ఎగుమతులును, దిగుమతులును చేయింతురు. వారు తప్పించుకొని పోదు రేమో యని కొందఱు వారిమీఁద తుపాకులు బారుచేసి పేల్చుటకు సిద్ధముగా నుందురు.

ఒకనాఁటి ప్రొద్దున నొక యోడమీఁద నున్న జన మంతయు కంగారు పడుచుండెను. ఓడపనివారలలో నొకఁడు కాలుజాఱి సముద్రమునఁ బడిపోయెను. వాఁడు లోపలఁ గొట్టు కొనుచుండెను. నీటివడియు నెక్కుడగుచుండెను. అది పోటు వేళ. అందుచేత నోడ లన్నియు నటు నిటు కొట్టుకొను చుండెను. అట్టితఱి పడిపోయిన నావికుని పైకీడ్చుట కెవరి కిని సాహసము కలుగకపోయెను.

అపుడు బందీలలో నొకఁడు ముందరికి వచ్చి "వా కాన పోడుచుచో నాకు చేతనయినంతవఱకు పైనఁగులా జె

దను'' అని యనఁగా వారి అధికారి ''మంచిది, దిగు'' మని అనుజ్ఞయిచ్చెను. వెనువెంటనే ఆ ఖైదీ తన కాలిగొలుసును పటపట త్రెంపి సముద్రములోనికి దుమికి మునిఁగిన వానిని దేవి, చంకనిఱికించుకొని పైకి తేలెను. ఈ లోపుగా ఓడమీఁదివార లొక మోకు సముద్రములోనికి విడిచి, పడిపోయినవాని నోడమీఁదికి లాగుకొనిరి. సముద్రములోనికి దుమికినవాఁ డలసిపోయినటులు కనఁబడెను. మరల మోకు వేయునంతలో వాఁడు మునిఁగిపోయి మరల నెవరికిని కనఁబడలేదు. అతఁడు జీన్ వాల్ జీన్. అతని నెఱిఁగినవా రెవరును అతఁ డంతమాత్రమున చనిపోవు నని అనుకొనరు. అతఁడు నీటిలో మునిఁగి యెంతో దూర మీఁదికొనిపోయి ఒడ్డు పట్టి చెఱసాల తప్పించుకొనిపోయెను.

౬

కోజెత్తువంటి దిక్కులేనిపిల్ల యీ జగత్తులో మఱి యొకతె లేదు. మూఁడేండ్ల యీడుననే తల్లియుండియు లేనిదాయెను. ఫాంటైన్ పంపిన డబ్బంతయుఁ దిని తెనార్డీర్ కోజెత్తుచేత ఊడిగము చేయించుకొనుచుండెను. ఇటు లతఁడు డబ్బు మ్రింగియు, పనిచేయించుకొనియు దానికిఁ దిన్నగాఁ దిండి పెట్టఁడు. గుడ్డలీయఁడు. పైఁగా చిన్న పొరపాటునకు పెద్ద శిక్ష చేయును.

తెనార్డీర్ కిరువురు కూఁతుండ్రు. వా రెపుడుచూచినను కిలకిల నవ్వుచుందురు. మంచిమంచి పరికిణీలు కట్టుకొందురు. ఆటలు తక్క వారికి వేఱుపని లేదు. కోజెత్తు దిగనాశిల్లి

పోవుచుండెను. చినుఁగు పరికిణీలును, చిల్లుల జుబ్బాలును గల బాలిక వంతు. తెనార్డీర్ కూఁతుండ్రీ పిల్లను తమకడకు రానీయరు. వారుగూడ దీనికి పనులు పురమాయింతురు. సరిగా చేయనియెడల తలిదండ్రులకుఁ జెప్పి కొట్టింతురు. ఆ యింట తుడుము మొదలు దేవతార్చనవఱకు నా పిల్లయే చేయవలయును. కోజెత్తుకు పనులన్నిఁటిలో నీటిపని యనిన ప్రాణగండము. వారున్నప్రదేశము నిర్జలము. ఇసుక వేసిన రాలని అడవియు, అందొక సెలయేఱును కొంచెము దవ్వునఁ గలవు.

ఆ సెలయేటినుండియే నీరు రావలయును. ఒకఁడు కూలికి నీరుమోయునుగాని అయిదుగంటలకుఁ జాలించును. అటుపిదప నీరు కావలయు ననిన ఎవరికి వారే తెచ్చికొనవలయును. కోజెత్తు అడవికిని, చీఁకటికిని భయపడి నీటికి కడు మెలఁకువ కలిగియుండును. ఇంటిల్లిపాదికి తాను దాసిగాన నీరులేనిచో తన కాపని తప్పదని కోజెత్తుకుఁ దెలియును.

కిసిమిసి పండుగ వచ్చెను. అంగడులన్నియు కలకలలాడుచుండెను. ఆ తిరునాళ్లకు క్రొత్త అంగడు లెన్నియో వచ్చెను. తెనార్డీర్ పెట్టిన పూఁటకూళ్లయింటి కెదురుగా ఒక బొమ్మలదుకాణము వెలసెను. దానఁగల బొమ్మల అన్నింటి నడుమ నొక పెద్దబొమ్మ కలదు. చూచినవారి నందఱను అది ఆఁపుచుండెను. కోజెత్తు దానికి తల్లిబొమ్మ అని పేరు పెట్టెను. ఆ బొమ్మ ఒక పెద్దపిల్లంత యుండెను. దానికి నల్లని కన్నులును, చక్కని వెండ్రుకలును, తెల్లనిదుస్తులును గలవు. తెనార్డీర్ కూఁతుండ్రా బొమ్మను వదలిపెట్టలేక పోయిరి. కోజెత్తుగూడ తీరిక యయినపుడెల్ల తొంగి చూచి వచ్చు

చుండెను. దానిని కొనుపాటి ధనవంతు లచట లేనందువలన ఆ చక్కనిబొమ్మ యచ్చటనే యుండెను.

తెనార్డీర్ పూటకూళ్లయింట సందడి యెక్కువాయెను. పిట్టలు గూండ్లకుం బోం దొడంగెను. చీంకటులు సమీపించు కొలంది బాటసారు లెక్కుడు కాం దొడంగిరి. బండ్లెన్నియో వచ్చి దిగెను. గుఱ్ఱమునకు నీరు చాలక యొకబండివాండు, "నా గుఱ్ఱమునకు నీరు లేదు" అని అఱచెను.

తన కునికియగు నొక బల్లక్రిందినుండి చరాలున లేచి వచ్చి "నేను దానికి నీరు పట్టితిని" అని కోజెత్తనెను. కాని అది కల్ల. అపు డేటికేంగి నీరు తేవలసి వచ్చునని దాని భీతి.

బండివాండు కన్నెఱ్ఱంజేసి—"గుఱ్ఱము సకిలించు చున్నది. అది దప్పికి గుఱుతు. బద్ధకముమాని యిపుడయినను దానికి నీరు పట్టుము" అని అనెను.

"మూలిగెదవేమి?" అని తెనార్డీర్ భార్య గదిమెను.

"ఇంట నొకచుక్కయేని లేదు" అని కోజెత్తనెను.

"నీరు లేకుండ నేలకూర్చుంటివే? పో, పోయి నీరు తే".

కోజెత్తు మఱి మాటాడక యొకమూలకుం బోయి తానందులోం గూరుచుండందగినంత బాల్చిని నెత్తికెత్తుకొనెను.

"పోవుదానవు పోవుచునే యుంటివి, అంగడిలో నొక రొట్టెకూడం గొనిరమ్ము" అని ఆమె యొక రెండు ఫ్రాంకుల నాణెము కోజెత్తు కిచ్చెను. కోజెత్తు దానిని జేబులో వైచుకొని తోడున కెవరినో అపేక్షించుచు నిలువంబడెను. అదిచూచి తెనార్డీర్ "ఓసి సోమరిపోతా! ఇంకను గోళ్లు గిల్లుకొనుచుంటివా? పో, పో" అని ఆ పిల్లను బయటికి

గెంటి తలుపులు మూసెను.

కోజెత్తు బొమ్మలంగడిలోని తల్లిబొమ్మను జూచుచు వడివడిగా పేటవరకు నడిచిపోయెను. అక్కడినుండి మఱి అడుగు పడలేదు. ముందుముందు మృగములును, దయ్యము లును ఉండవచ్చును. మృగములు మేయు చప్పుడు వినవచ్చు చునే యుండెను. చెట్లనడుమ దయ్యము లేల యుండవు? కోజెత్తు వెనుదిరిగెను. ఏటినీరు నేను తేజాలనని చెప్పి వైతునని తలంచెను. పది యడుగులు వెనుకకు వైచి నిలువంబడెను. తెనార్డిర్ భార్య గ్రుడ్లుఱుముచు కనుల ద్రేలెను. అంత మరల నేటిమొగమై నడవం దొడంగెను. ఘంటాపథమువిడచి కాలిబాట నడవినిబడి వడవడ వడం కుచు నడచినడచి ముచ్చెమటలతో సెలయేటి యొద్దచేరెను.

అచట సూదిదూఱని చీకటియైనను ఆ ప్రదేశమం తయు నా బాలికకు సుపరిచితము. కోజెత్తు ఆ యొద్దున నున్న యొక చెట్టుకొమ్మ నెడమచేతం బట్టుకొని ప్రవాహములోనికి వంగి కుడిచేత బాల్చిని నీటముంచెను. వంగుటచే జేబు లోని రెండుఫ్రాంకుల నాణెము నీటంబడిపోవుట యా బాలిక యెఱుంగదు. ఎటులనో ఆ బాల్చిని పైకి లాగెను. పిదప నా పిల్ల చీకటి భయముచే మిగుల వడిగా పరుగెత్తం బూనెను గాని బాల్చి? దాని నెత్తుకొనుట కటునిటు చూచు చుండెను. అంతలో హఠాత్తుగా నొకండువచ్చి కోజెత్తు ప్రక్క నిలిచెను. అతని దుస్తులు సాధారణముగనే యుండుట వలన నా బాలిక భీతిలలేదు. అతండా బాల్చిని తీసికొని ముందునడచుచు "అమ్మా! నీ కెన్నియేండ్లు?" అని యడిగెను.

"అయ్యా! ఎనిమిదేండ్లు."

"మీ యింటికిని, ఇచటికిని ఎంతదూరము?"

"పదియేను నిమిషములలో పోవచ్చును."

"మీ అమ్మ తానురాక నిన్నేల పంపెను?"

"వారి కమ్మ యున్నది కాని నాకు లేదు."

"వా రెవరు?"

"అజెల్మా, ఎపొనీను. వారి అమ్మ తెనార్డీర్."

"మఱి నీ పేరు?"

"కోజెత్."

వెతకఁబోయిన తీఁగ కాలఁ దవిలెను. జీన్ వాల్ జీన్ సంతసించెను. వారు మెలమెలగా నిల్లుచేరిరి.

"అయ్యా! ఇఁక బాల్చిని నా చేతి కొసఁగుఁడు."

"ఎందులకు?"

"నీ వెందులకు తేలేదని తెనార్డీర్ దండించును."

జీన్ వాల్ జీన్ బాల్చిని కోజెత్తుచేతికిచ్చి తలుపు తట్టెను. తెనార్డీర్ భార్య తలుపుతీసి కోజెత్తును ముందు చూచి, "ఓసి పాడుముండా! అదేపోకా? దారిలో ఆడుకొనుచుంటివా?" అని మండిపడెను. కోజెత్తు భయపడుచు "అమ్మా! వీరికి భోజనమును, పడుకయుఁ గావలయును" అని అనెను.

ఆమె స్వరము మార్చి—"అయ్యా! లోనికి దయచేయుఁడు" అని వినయము నొలుకఁబోసెను. వాల్ జీన్ లోని కేఁగి రొట్టెయు, పాలును గోరెను. తెనార్డీర్ భార్య తెచ్చియీయఁగా నతఁడు తినుటకుఁ గూరుచుండెను. కోజెత్తు బాల్చిని క్రిందపెట్టి గబగబ ఒక బల్లక్రిందికి దూఱి కూరు

చుండుట వాల్‌జీన్ గమనించెను.

సరియగు పోషణ లేమిని, చింపిరిబట్టల కలిమిని కోజెత్తు చూచుట కెల్లిదముగ నుండెను. ఎనిమిదేండ్ల యీడుగల యీ బాలిక ఆరేండ్ల దానివలె నుండెను. కోజెత్తు పాలిపోయి బక్కచాటెను. విశాలములగు కన్నులెప్పుడు నేడ్చుచుండుటచే చీకులించుకొనిపోయెను. దైన్యమును వెళ్ళఁబోయుచుండుటచే నాసెలవులు క్రిందికి వంగెను. ఆ చేతులు పనిరాపిడికిని, చలికిని నెత్తురు చిమ్ముచుండెను. చింపిగుడ్డల క్రంతలనుండి యెముకలును, కాలుసేతులమీఁద దెబ్బలును వాల్‌జీన్‌కు కొట్టవచ్చినటులు కానిపించెను.

అపుడు తెనార్డీర్ భార్య—"రొట్టె యేదే?" అని కోజెత్తును తటాలున నడిగెను. కోజెత్తుకు గుర్తేలేదు. చీటికి మాటికి దెబ్బలు తినుచుండుటవలన నా పిల్లకు కల్లలాడు టలవాటై చెల్లెను. "రొట్టెల యంగడి మూసివేసిరమ్మా" అని చెప్పెను. "నీవు తలుపుతట్టి అడుగకపోతివా?"

"ఎవరును పలుకలేదు."

"అగుచో నేనిచ్చిన డబ్బేది?"

కోజెత్తు జేబు తడుముకొనెను. లేదు. అంతట నా పిల్ల తల తడవికొనఁ దొడఁగెను.

"ఓసి ముసానమ్మా! మాటాడవేమి?" అని ఆమె గోడకు తగిలించిన కొరడా అందుకొని "నీవు రొట్టెను కొని తింటివా లేదా చెప్పుము" అని జడిపించెను.

"అమ్మో! కొట్టకు, అమ్మో! కొట్టకు, మఱి యెన్నఁడు చేయను" అని కోజెత్తు లబలబ కొట్టుకొనెను.

ఆమె యొక్క చలువు చలుచుటకు కొరడా యెత్తు నంతలో జీన్ వాల్‌జీన్ నాలుగుఫ్రాంకుల నాణెమును క్రిందఁ బెట్టి—"అదిగో ఆక్రిందనున్న దేమిటి?" అని అడిగెను.

తెనార్డీర్ భార్య చూచి "అదే" అని అనెను. "పిల్లది వంగినపుడు క్రిందఁ బడిపోయియుండు"నని వాల్‌జీన్ అనెను.

"కాఁబోలు, కాఁబోలు"నని రుసరుసలాడుచు నామె యా నాణెమును తీసికొనెను.

వాల్‌జీన్ నాణెమునుక్రిందఁబెట్టుట కోజెత్ చూచెను. "అమ్మో! ఈయన దేవదూతయై యుండు" ననుకొనెను.

తల యంటుకొని చలువచేసిన వలువలు కట్టుకొని తెనార్డీర్ కూఁతుండ్రు చావడిలోనికి వచ్చిరి. తల్లి నెటికలు విఱిచి యెత్తుకొని ముద్దాడి 'బంగారు బొమ్మలు, బంగారు బొమ్మలు' అని గిఱ్ఱున త్రిప్పి 'ఇఁక ఆడుకొనుఁడు, ఇఁక ఆడు కొనుఁడు' అని వారిని దింపి, తాను లోనికేఁగెను. అంతట నాపిల్ల లొక బొమ్మతో నాడుకొనఁ దొడఁగిరి. అది తాతల నాఁటిది. రెండు ముద్దులతోడను, రెండుదెబ్బలతోడను అది పాడాయెను. పెద్దపిల్ల దాని నావలఁ బాఱవయిచి ఒక పిల్లి బొమ్మను తీసికొని దానికి ముస్తాబుచేయ దొరకొనెను. వారిమాట లేమో వారేమో కాని కోజెత్తుతో వారి కేమి పని? కోజెత్తుకూడ తమవంటి పిల్లయే యను తలఁపు వారికి లేదు. పెద్దపిల్లయు, కోజెత్తును ఒకయీడువారే.

పెద్దపిల్ల—"ఇదిగో అజెల్మా! ఈబొమ్మ ఆ పాఁత బొమ్మకన్న మంచిది. ఇది నడచును. మ్యావునని అఱచును. చూచితివా, నేను తల్లిననుకో. ఇది నాపిల్ల అనుకో. నేను

దీనిని నీకు చూపవత్తును. నీవు దానిని ప్రేమతోఁ జూతువు. నీవు దీని మీసలుచూచి వింతపడుదువు. దీని చెవులును, తోఁకను గాంచి ముక్కుమీఁద వేలు వేసికొని, 'ఇది యెంత వింతలమారి పిల్లమ్మా? ఇది యెక్కడిది?' అని నీవందువు.

"ఔనండీ! ఇది నా చిట్టి. ఈ కాలపు పిల్లలందఱు ఇటులనే యుందురని నేనందును" అని పలుకుచుండఁగా కోజెత్తు మెల్లగా ప్రాఁకివచ్చి వారు చిక్కఁజీరుగా పాఱ వయిచిన బొమ్మను తీసి యెత్తుకొని అటు ఇటు ఊఁపుచు క్రిందఁ గూరుచుండి కాళ్లమీఁద పడుకొనఁబెట్టుకొని జోల కొట్టఁ దొడఁగెను. కోజెత్తింతవఱకును బొమ్మలతో నాడి యెఱుఁగదు కావున నిపుడు క్రీనీడలోఁ గూరుచుండి యితర మెఱుఁగక ఆ బొమ్మను నిదురపుచ్చుచుండఁగా అజెల్మా చూచి అక్కను వ్రేలితోఁ బొడిచెను. అంత వారిరువురును లేచి తల్లికడకుఁ బరువిడి—"అమ్మా! యిటువచ్చి చూడుము" అని అనిరి. కోజెత్తు ఆ సంతోషములో వారి చేష్టలుగాని, వారిమాటలుగాని ఎఱుఁగదు. వారితల్లి పెద్ద పులివలె మీఁదికి దుమికి "కోజెత్!" అని అఱచెను.

కోజెత్తు ఉలికిపడి కాళ్లమీఁది బొమ్మనుతీసి మెల్లగా క్రిందఁబెట్టి చేతులుచేర్చి వెక్కివెక్కి యేడ్వఁదొడఁగెను. "ఏమది?" అని వాల్జీన్ అనెను.

తెనార్డీర్ భార్య బొమ్మనుచూపి—"కనఁబడుట లేదా?"

"ఆ పిల్ల ఆ బొమ్మతో నాడుకొనరాదా?"

"ఆ పిల్లయా! ఆ బొమ్మతోనా? అది ఆ పాడు చేతులతో దానిని ముట్టుకొనుటయా!"

జీన్ వాల్ జీన్ మఱి మాటాడక వెలికరిగెను. చిచ్చు లేక చిముడు నా యిల్లాలు కోజెత్తు నొక తన్ను తన్నెను. కోజెత్తు బావురు మనెను. ఇంతలో వాల్ జీన్ తల్లిబొమ్మను గొని లోనికివచ్చి, కోజెత్తుతో "ఇదిగో ఇది నీకు" అనెను.

కోజెత్తుకు దిగ్భ్రాంతి కలిగెను. కూరార్కై కొంచెము కొంచెము వెనువెనుక కొదిఁగెను. అందఱును వింతగాఁ గనఁ దొడఁగిరి. అంతట తెనార్డీర్ తన భార్యను చాటునకు పిలిచి— "ఆ బొమ్మ 30 ఫ్రాంకులు పైఁగా చేయును. దానిఁ గొనుట కితఁడు చాల ధనికుఁడయి యుండవలయును. కావున ఆయన యెడల మరియాదగా ప్రవర్తింపుము" అని చెప్పెను. ఆమె తలయూఁపి సావడిలోనికి వచ్చి—"ఆ బొమ్మను తీసికొన వేమి?" అని యెంత స్వరము మార్చి చెప్పినను ఆమె పలుకులో మాత్రము కటుత్వము తగ్గలేదు.

కోజెత్తు రెండడుగులు ముందరికి వచ్చెను. నీరు ఉరులు చున్నను ఆ పిల్లకన్నులు సంతసముతోఁ బ్రకాశించెను.

"అమ్మగారూ! నేను తీసికొనవచ్చునా?"

"ఆఁ. వారు నీకిచ్చుచున్నారు తీసికొనుము."

"అయ్యో! నిక్కముగా నిత్తురా!" అని కోజెత్తడిగెను.

ఆ దైన్యమునకు వగచి మాఱుపలుకలేక వాల్ జీన్ ఆ బొమ్మను కోజెత్తుచేతులలో నుంచెను.

"నేను దీనికి 'కేతరీన్' అని పేరు పెట్టుకొందును" అని కోజెత్తు దాని నొక బల్లమీఁద నుంచి రెప్ప వాల్పక చూచుచుండెను. అది చూచిన తెనార్డీర్ కూఁతుండ్రు కను

తెల్లఁజేయఁగొడఁగిరి. వారితల్లి 'యిది మంచి లక్షణముకా' దని వారి నిరువురను లోనికిఁ దీసికొనిపోయి నిఁడురపుచ్చెను.

ఫ్రాన్సు పోయిన తరువాత జీన్ వాల్ జీన్ తెనార్డీర్ కడ కరిగి ఫాంటైన్ తన కిచ్చిన ఉత్తరమును జూపెను. తెనార్డీర్ అప్పుడు కోజెట్టుకు అయిన వెచ్చమును ఒకటికి పది చేసి చెప్పెను. జీన్ వాల్ జీన్ ఆ ధనము నంతయు నిచ్చి వేయుటచే అతనికి కోజెత్తు నప్పగింపక తప్పలేదు. అప్పటి కప్పుడు వాల్ జీన్ కోజెత్తుకు మంచి పరికిణీలును, జుబ్బాలును కొనితెచ్చెను. తెలవారకముందే వాని నా పిల్లకు కట్టఁబెట్టి చేయి పట్టుకొని యా కొంపనుండి తీసికొనిపోయెను.

పారిస్ నగరము చివర కూలినాలి చేసికొని బ్రతుకు పేదవారి పేటలో వాల్ జీన్ ఒకయి ల్లద్దెకుఁ గొని అందు కోజెత్తుతో కాఁపుర ముండెను. అది పడిపోవుచున్నటు లున్న యొక ప్రాంతమేడ. మేడమీఁది పడుకగది కిటికీ తలుపులు తెఱచి నప్పుడు యెడల రోడ్డుమీఁదఁ బోవు జనమును, బండ్లను కనఁబడుచుండును. ఈ యింటి యెదుట విశ్రాంతికిఁగాను రోడ్డుప్రక్కగా ఒక చిన్న ఆటతోఁట కలదు. ఆ చుట్టు ప్రక్కలవా రందఱు నచట విశ్రాంతి గొనుటకొఱకు వచ్చుచుఁ బోవుచు నుందురు.

ఆ యింటిచుట్టును కావలసినంత శూన్య ప్రదేశ మున్నది. పెద్ద ప్రహరి యున్నది. దానివలన ఇరుగు పొరుగువా రెవరికిని అందుఁగల జనులయెడ కుతూహలము తక్కువ. ఆ మేడక్రింది గదులన్నియు చాల జీర్ణము లయి యుండెను. మేడమీఁదఁగూడ నొకగది తప్ప మిగిలిన

వన్నియు కుటీరము లనియే చెప్పవచ్చును. మేడకును, క్రింది గదులకును సంబంధము లేదు.

వాల్ జీన్ కు పనిచేయు పరిచారిక ఆ మేడమీఁద నొక కుటీరమువంటి గదిలో నివసించుచుండును. ఈ ముదిపరిచారికయే ఆ యింటి యద్దె వసూలు చేసి గృహస్వామి కిచ్చుచుండును. ఒకరి నా యిండ్లలో ప్రవేశపెట్టుటకుఁగాని, వెడలనడఁచుటకుఁగాని ఆయమదే యధికారము.

వాల్ జీన్ ఈ యిల్లద్దెకుఁ గొనునపుడు—నిధిలో (బ్యాంకు) నిలువయున్న సొమ్ముమీఁద వచ్చు వడ్డీవలననే తనకు జీవనము జరుగవలసి యున్నదనియుఁ, దనకు వేఱుపని యేమియు లేదనియుఁ జెప్పి యాఱునెలల యద్దె ముందే యిచ్చివేసెను. గృహభార మంతయు ముసలిదాని కప్పఁ జెప్పి దానికి కొంత జీత మేర్పాటుచేసెను.

దినముల తరువాత దినములు, పక్షముల తరువాత పక్షములు చనుచుండెను. తెలవాఱక తలికె కోజెత్తు లేచును. వాల్ జీన్ భగవద్ధ్యానము చేయుచు కోజెత్తుచే చేయించును. తెలవాఱఁగనే స్నానపానములు ముగియును. పిదప వాల్ జీన్ కోజెత్తుకు చదువు చెప్పును. తనను పోలీసు లెఱిఁగిరేని చావువఱకు చెఱలో నుంతురని వాల్ జీన్ కు భయము. అతని మనసులో నెపుడును దీనుల కుపకారము చేయవలె నని యుండును. కాని అతని మోమున ఆ భాగ్య పంక్తి లేదు. కావున నతని సత్సంకల్పములు తుదనెగ్గు టరిది. ఇట్టి యొడిదొడుకులలో నొరులకుఁ దెలియకుండఁ జేత నయినంత ఉపకారము చేయుచుండవలెనని అతని ఆశయము.

పగలెపుడు నతఁడిల్లు విడిచిపెట్టఁడు. కోజెత్తు కెల్లప్పుడును భగవంతునిగూర్చి బోధించుచుండును. పుట్టినదిమొదలు కోజెత్తు మంచితనమను దిను సెఱుఁగదు. ఇపు డీ మనుష్యునిఁ జూచి ప్రపంచమంతయు ఆనందమయమని యూహింపఁదొడఁగెను. చదువయినపిదప కోజెత్తు తన బొమ్మతోఁ గూరుచుండి తనకు తల్లిలేని లోపమును పూరించుకొనుచుండును. వాల్జీన్ అదిచూచి యానందించును. మఱియు జీవితమున కొక గొప్ప ఉద్దేశమున్నట్లు గ్రహించును.

మనుజులలో నెంతయో మంచితనము కలదని యతని కిపుడు తెలిసివచ్చెను. ఇపు డతఁ డెవరిని దూషింపఁడు. అతని కిపుడు బ్రతుకుమీఁద తీపి పుట్టెను. ఏలయనిన కోజెత్తు తనను అమాయికముగా ప్రేమించును. ఈ ప్రేమకు విలువలేదు. నిక్కమునకు తా నెవఁడు, కోజెత్తైవతె? మేఁకపిల్ల కటికవాని నయినను నమ్మి యతని వెంట నడచును. కటికవాఁ డది సాకుగా దానిని నఱకును. వానికే దాని పవిత్రత తెలియుచో భగవంతుఁ డెంత దాపగును? అని యతఁ డూహించుకొనుచు ఈ వార్ధకమున మానవునిలో నున్న సత్యము నతఁడు కనుఁగొనెను.

అతఁడు ప్రొద్దుగ్రుంకిన పదపడి ఒంటరిగను, ఒకానొకపుడు కోజెత్తును వెంటఁబెట్టికొనియు రెండుమూఁడు గంటలు షికారు పోవుచుండును. జనము పలుచగా నున్న రోడ్లమీఁదనే అతఁడు తిరుగాడును. అతఁ డొంటరిగనే వెళ్లినయెడల కోజెత్తు ఇంటికడనే ముసలిదాని ప్రాపున నుండును. కాని యా బాలిక కాతనితో తానుగూడ తిరు

గాడుట యుత్సాహము. ఏల యనిన ఆ బాలిక—'అది యేమి? ఇది యేమి?' అని ప్రశ్నించి వాని వాని పుట్టుపూర్వములు తెలిసికొనుచుండును. రాత్రిపూట నతఁడు చర్చికిఁ బోయి భగవంతుని ప్రార్థించి వచ్చుచుండును.

దాసి ఆ యిల్లంతయు శుభ్రముగా నుంచును. కూరగాయలు కొని వచ్చును. అన్నము వండును. రొట్టియు చేయును. పక్కలు పఱచును. అతఁడు బీదవానివలెఁ గాలము గడుపుకొనుచుండెను గాన నాయింట నార్భాట మిసుమంతయు లేదు.

అతఁడు షికారు పోవు సమయములలో ధనికు లెవరయినను అతని వాలకమును జూచి బిచ్చగాఁ డనుకొని చేతిలో నేమేని పెట్టవచ్చినచో కిక్కురు మనకుండ పుచ్చుకొని, తల వంచి వారికి చేతులు జోడించుచుండును. మఱియు నతనికి బిచ్చగాం డ్రెవరేని కనిపింపఁగా నతఁడు నలుదెసలు చూచి, వానిచేతులలో తృణమో కణమో పెట్టి గబగబ ముందర కరుగుచుండును. ఇటు లతఁడుగూడ నొరుల కిచ్చుచుండుటచేత 'ఇతఁడు భిక్షు వయినను దాత' యని యందఱు ననుకొనఁ జొచ్చిరి.

ముసలిదాసి వట్టి యనుమానపిశాచి. దాని కెంత మంచివారిమీఁదను సందియమే. 'వీ రెచటినుండి వచ్చిరి? ఎందుల కిచట నుండిరి? వీరికి డబ్బెటులు వచ్చుచున్నది?' అను నీ మొదలగు ప్రశ్నలతో నామెతల నిండియుండును. దానిది లోపలస్వయంపాకము. దాని పండ్లన్నియు నూడిపోయెను గాని ముందరి రెండు పండ్లకుమాత్ర మాశపోలేదు.

ఆమె రేయుంబవలు ఆ రెండు పండ్లను కదలించుచుండును.

వాల్‌జీన్ ఒకనాఁడు పక్కగదిలోనికిఁ బోయెను. అది శూన్యము. అది దాసిచూచి, 'ఇతఁ డెవరును లేని యీ గదిలోని కేల పోయె'నని యనుకొని తానును అతనికిఁ దెలియకుండఁ బోయి యొక కంతలోనుండి తొంగి చూచుచుండెను.

వాల్‌జీన్ లోపలి కేఁగి తలుపులు మూసికొని తన్నెవరైనను జూతురని తలఁపక కోటువిప్పి దాని లోపలిభాగమున నున్న దారపుఁగుట్టను సూదితో నూడఁదీసికొని కాగితములను లాగి వానిలో నొకదానిని మాత్రము బయటనుంచి మిగిలిన వానిని మరల లోపలదోఁపి కుట్టివేసెను. వృద్ధదాసికి వేయి ఫ్రాంకుల నోటు స్పష్టముగా నగపడెను. అపు డది ఆశ్చర్యపడి యచట నిలువఁజాలక పరుగెత్తుకొనిపోయెను.

వాల్‌జీన్ కొలఁదిసేపటిలోనే వెలికివచ్చి దాసిని బిలిచి "అమ్మా! నిన్న నే నిధినుండి వడ్డివచ్చినది. ఈ వేయిఫ్రాంకుల నోటు తీసికొనిపోయి మార్చుకొని రి"మ్మని నోటిచ్చెను.

'నిన్న చీఁకటులుపడిన తరువాతఁగాని యితఁ డిల్లు కదలలేదు. ఈ నోట్లితని కెటులువచ్చెను? నిన్న కుప్పయు నేఁ డాళ్లునా?' అని యా ముదుసలిత్తొ లోలోపల గొణుఁగుకొని యా నోటును చేతఁబుచ్చుకొని వెళ్లిపోయెను.

ఒకనాఁడు కోజెత్తును వెంటఁబెట్టుకొని వాల్‌జీన్ షికారుపోయెను. అపుడు దాసి యొక తెయే యింట నుండెను. దానికి గోడమీఁద వ్రేలాడుచున్న ఒకకోటు కనిపించెను. దానికి జేబులలో నే మున్నవో చూడవలయు నని బుద్ధిపుట్టెను. అంతట నది వాకిలి మూసి వచ్చి జేబులు తడిమి

లోపలి వస్తువులను దేవిచూచెను. సూది దారము, రంగు రంగుల సవరములు, కత్తి మొదలగు వస్తువులే కాక కుట్టిన జేబొకటి దానికి కనఁబడెను. అది ఉబ్బెత్తుగా నుండెను. అదిమిచూచి—'ఇవియు నోట్లా?' అని యనుకొనెను. ఈ లోపుగా వాల్‌జీన్ వచ్చుచున్న అలికిడి ఆయెను. అది తలుపు తెఱచి యూడ్వఁ దొడఁగెను.

ఆయింటికి దాపుగానున్న యొక రోడ్డుమీఁద నొకఁడు ప్రతిదినము సాయంసమయమున బిచ్చమెత్తుకొనుచుండును. వాల్‌జీన్ ఆదారిని బోయినపుడెల్ల వాని కొకటి రెండు డబ్బు లిచ్చుచుండును. అపుడపుడు వానియెదుటనిలిచి పలుకరించుచుండును. ఆ బిచ్చగాఁడు దొంగ బిచ్చగాఁడనియు, పోలీసువారి గూఢచారి యనియు, బిచ్చమడుగుట నటన యనియుఁ గొందఱు చెప్పుకొందురు. అతఁడొకానొకపుడు పోలీసుపని చేసెనుగాని ఇపు డెల్లపుడును జపమాలద్రిప్పుచు నా బాటమీఁదఁ గూరుచుండును.

ఒకనాఁడు చీఁకటులు పడినపిదప వాల్‌జీన్ ఒంటరిగా ఆదారిని బోవుచుండెను. బిచ్చగాఁడు యథాస్థానమునఁ గూరుచుండి యుండెను. అతఁడు వాల్‌జీన్‌ను జూచి దివ్వె పైకెత్తి చేయిచాఁపెను. వానిచేతిలో డబ్బు వేయఁబోయి వాల్‌జీన్ ఆ వెలుఁగున వాని మోముఁజూచెను. వాఁడును వాల్‌జీన్ మోమును జూచెను. వాల్‌జీన్ పెద్దపులిని జూచిన మేఁకపిల్లవలె గజగజ లాడెను. అది తా నెన్నఁడో చూచిన మొగము! చీఁకటిలో పులి! ముందుల కేఁగరాదు, వెనుకకు రారాదు. మఱి నిలువనురాదు.

వాల్‌జీన్‌కు గాలి యాఁగెను. చూపు నిలిచెను. భిక్షుకుఁడు తా నచట లేనటులే తల వంచుకొని, పెండ్లి కూఁతువలెఁ గూరుచుండెను. ఇఁక బ్రతుకఁదలఁచినచో మఱి మాటాడక పాఱిపోవుటయే పని యని వాల్‌జీన్‌కుఁ దోఁచెను. జోగిలో మాఱు పేమియు లేదు. దైనందిన మతఁ డెటు లడుగునో, యెటులు చూచునో యటులనే యడిగెను; అటులనే చూచెను. కావున—'నా కేమయిన వెఱ్ఱియా? అతఁ డెవఁడో యితఁ డెవఁడో' అని వాల్‌జీన్ అనుకొనెను.

ఆనాఁ డతఁడు మఱి తిరుగాడఁ బోవక యింటికి మరలెను. 'ఈ మొగము జేవరు మొగమువలెనే యున్నది. వలెనే యేమి? అచ్చ జేవరు మొగమే!' అని మరల ననుకొని యటుపైని నా యాలోచనమును నిగ్రహించెను. తిరిపె గాఁడు దీనముగాఁ జూచినను వానితో నొకమాటయేని చెప్పకయుఁ, దిరిపెము నిడకయుఁ దాను దిరిగివచ్చినందులకు అతనికిఁ జింత కలిగెను.

మఱునాఁడు కూడ బిచ్చగాఁ డక్కడనే యట్లే కూరుచుండెను. వాల్‌జీన్ వాని యెదుటికేఁగి, "అయ్యా! ఏమి వార్తలు? ఆరోగ్యముగ నుంటిరా?" అని ముచ్చటించుచు నతనిచేతిలో నొక ఫ్రాంకు నిడెను. అతఁ డా ఫ్రాంకును దీసికొని కృతజ్ఞతతోఁ దలయెత్తి, "పరమేశ్వరుఁడు మీకు మేలు కలిగించుఁగాక" యనెను. ఆమాటలు విని వాల్‌జీన్ ముందులకు సాగిపోయి "ఇతఁడు తప్పక జేవరే, తప్పక జేవరే" అని యనుకొనెను. కొంతసేపటికిఁ దిరిగి వచ్చుచు మరల నతనినిఁ జూచి "అబ్బె, ఇతఁడు జేవరు

కాఁడు. వెఱ్ఱియనిన మఱియేమిటి? నాకు చూపులో శక్తి యుడిగెనో, లేక బుద్ధి తిరిగెనో!'' యనుకొని అతఁడా సంగతి మఱచిపోయెను.

కొన్నాళ్లు గతించిన తరువాత నొకనాఁటిరేయి ఎనిమిదిగంటలవేళ వాల్‌జీన్ కోజెత్తుకు పాఠము చెప్పుచుండెను. అపుడు ప్రహరి తలుపులు తెఱచినటులును, మరల మూసినటులును చప్పుడాయెను.

అది వాల్‌జీన్‌కు ఉద్వేగము కలిగించెను. తానును, దాసియుఁ దక్క నచట నింకొక రెవరును కాఁపుర ముండుట లేదు. ప్రొద్దు గ్రుంకినచోఁ జమురుచేటని దాసి వెలుతురుండఁగనే తిని నిద్రించును. కావున నిపు డీవచ్చినవా రెవ రని అతనికి సందియము కలిగెను. అపు డతఁడు కోజెత్తు నూరకుండఁబెట్టి యాలకింపఁ దొడఁగెను. 'ఏదేని పనిమీఁద దాసియే వెలుపలికి వెళ్ళివచ్చి తలుపులు మూసెనేమో' యని యొకసారి యనుకొనెను. పాదరక్షల చప్పుడెక్కువగా నుండెను. ముసలిదాని పాదరక్షలుగూడ నెక్కువ చప్పుడు చేయును. 'ఐనను పరిశీలించినచోఁ దప్పేమి?' అని తలఁచి యతఁడు దీపమును ఫూ యని యూఁదెను. కోజెత్తును పడుకొనుమని యాదేశించెను. ఇంతలో నాచప్పుడు తమ గుమ్మముముందులకే వచ్చి యాఁగెను. వాల్‌జీన్ ఊపిరి బిగఁబట్టి చెవులు దోరబెట్టెను. ఎంతసేపటులున్నను మఱి యలికిడి వినఁబడలేదు. తలుపుసందునుండియొకచిన్న వెలుఁగు దుష్టగ్రహమువలె నతనికిఁ గానిపించెను. కొంచెము సేపటికదియు నాఱిపోయెను. ఆ వచ్చినవాఁడు పాదరక్షలు విడిచి

వయిచెనో, లేక వెళ్ళిపోయెనో కాని మఱి చప్పుడు లేదు.

వాల్ జీన్ కారేయి కునుకు రాలేదు. మఱుసనాటి ప్రొద్దున ప్రక్కగది తలుపుచప్పుడువలన నతఁడు లేచెను. అది తాను రాత్రి విన్న పాదరక్షల చప్పుడే. అతఁడు వెంటనే తలుపుసందులో కన్నువెట్టి చూచెను. ఏమియుఁ గానరాలేదు. ఆ ధ్వని గుమ్మముముందుండి కొంచెము పెడగాఁబోయి మేడమెట్లమీఁదుగా వినఁబడఁదొడఁగెను. మెట్లెక్కుచున్న వానిమొగ మపుడు కనఁబడెను. అది జేవరుమొగమువలె నుండెను. చేతిలో నొక లాటికఱ్ఱ. వాల్ జీన్ కు తలుపుతీసి చూడవలె నని యనిపించెను గాని యందులకు సాహసము చాలకపోయెను.

దాసి యేడుగంటలవేళ ఇంటిని శుభ్రపఱచుటకు వచ్చెను. వాల్ జీన్ దానిని వక్రముగాఁ జూచెనుగాని యేమియు నడుగలేదు. అది మామూలుగనే తనపని చేసి కొనిపోవుచుండెను. కొంతసేపయినపిదప నది వాల్ జీన్ ను జూచి—"రాత్రి యెవరో వచ్చినటు లుండెను, మీరు విన లేదా?" అని యడిగెను.

"వింటిని. ఆ వచ్చినవా రెవరు?"

"నిన్న నొక క్రొత్తవాఁడిచటికి అదవకాఁపురము నకు వచ్చెను. అది వానిచప్పుడు."

"వారిపేరు?"

"సరిగా గుఱుతులేదు. ద్యుమన్ అనియో [illegible] అనియో చెప్పెను."

"అతని కేమి పని?"



దాసి వాల్‌జీన్‌ను జూచి, "మీవలెనే వడ్డిపెట్టుకొని జీవనము చేయును" అని యనెను. అది పుల్ల విఱుపు మాటయో, నిక్కపుమాటయో కాని వాల్‌జీన్‌కు మాత్ర మింక నక్కడ నొక నిమిషమేని యుండరాదని తోఁచెను.

దాసి పని ముగించుకొని వెళ్లఁగనే యతఁడు ప్రయాణ సన్నాహముమీఁద నుండెను. ప్రొద్దు పడమర తిరుగఁగనే యతఁడు నోట్లన్నియు జేబులోఁ బెట్టుకొనెను. తనకుఁ గావలసిన సామగ్రిమాత్రము తీసికొనెను. ఒకటి రెండు మాఱులు రోడ్డుమీఁదికేఁగి పరికించి—'ఈ దారి యొకటి యున్నదనియే లోకుల కెఱుక లేదు' అని యనుకొని యతఁడు మరల నింటిలోనికేఁగి—"మన కింక ఋణము తీఱినది. రా, పోదము" అని కోజెత్తుతో ననెను. ఎఱిఁగిన పిల్ల కావున కోజెత్తు మఱి మాటాడక వాల్‌జీన్ చేయి పుచ్చుకొనెను. అంతట వారు రెండుమూఁడు రస్తాలు దాటిపోయిరి. ఎవరయినను వెనుకనుండి తమ్ముఁ గనిపట్టుచుందురేమో యని వారీసందునుండియు నాగొందినుండియుఁ జనఁదొడఁగిరి. చంద్రుఁ డుదయించెను. మబ్బులు లేవు. పండువెన్నెల. ఇంటినీడలలో వారు నడచిపోవుచుండిరి. ఇటులు దొంగల చందముగాఁ బోవుటకుఁ గారణమేమో కోజెత్తెఱుఁగదు. ఇది తనకును, తనతండ్రికిని ఏదో యాపదయని మాత్ర మా బాలిక గ్రహించెను.

పదొకండుగంట లాయెను. వారటు పోవుచుండఁగా నెత్తెదుట పోలీసుస్టేషన్! వాల్‌జీన్ వెనుదిరిగి చూచెను. ముందు జూచెను. ఇటు లెడతెగక చూచుకొనుచుఁ బోవు

చుండఁగా మూగురు మనుష్యులు తమ దెసకే వచ్చుచున్నటు లతఁడు గమనించెను. వారు తన్ను వెన్నాడుచున్నారని అపు డతనికి తేటతెల్లముగాఁ దెలిసివచ్చెను. ఆ వచ్చు చున్నటు లున్నవా రందఱును స్టేషనులోనికిఁ బోక వారిలో నొకఁడుమాత్రమే పోవుటయు, స్టేషనులోనుండి వచ్చి యిం కొకఁడు వారిలోఁ గలియుటయు, మరల వారు మూగురును తన్ననుసరించుచు వచ్చుచుండుటయుఁ గనఁబడుచుండుట వలన నతని సందియము మఱియు దృఢమాయెను. అతఁడు వెంటనే దీపములులేని యొకసందునఁబడి పిదప నేడెనిమిది గొందులు తిరిగి క్రీడావనములుగల యొకప్రదేశము చేరెను. అచట నొకపరి వెనుదిరిగి చూచెను. పండువెన్నెలలో వారందఱు నతనికిఁ జక్కఁగాఁ గనఁబడిరి.

ఇపుడు వారు నలుగురు. నలుగుర చేతులలోను లాటి కఱ్ఱలు. అందఱ నెత్తిమీఁదను టోపి. వారి కవళికలవలన నందఱకును భయ ముద్రేకించును. అందును ఇట్టి నడిరేయి పోలీసులు కొందఱు కాఁపువేసి తిరుగుచున్నా రనిన నెవరి మొగములలో భయసంచారము కలుగకుండును?

వారు నలువురు నా తోఁటనడుమ నిలువఁబడి వాల్‌జీన్ ఎటుపోవుచుండెనో కన్నులు పొడుచుకొని చూచుచుండిరి. వారు తమలో నెవ రెవ రేమేమి చేయవలయునో యాలో చించుకొనుచుండిరి. వారి నాయకుఁడు వాల్‌జీన్ పోవుచున్న దిక్కును తర్జనితో నిర్దేశించెను. మఱియొకఁడు దానికి విప రీతమగు దిక్కును నిర్దేశించెను. వారు మెలమెలగా తమలోఁ దా మాలోచించుకొనిన తరువాత నిరువు రొక దిక్కుగను,

మఱియిరువురు దాని కెదురుదిక్కుగను బయలుదేరిరి.

అపుడు వెన్నెల పుచ్చలు పూచినటు లుండెను. వాల్ జీకు ఆ వెన్నెలలో పోలీసుపెద్ద చక్కఁగా కానిపించెను. అతఁడు మూఁడు మూర్తుల జేవర్! అతని పరమశత్రువు జేవర్! వాల్ జీక సందేహము తీఱిపోయెను. ఏమిచేయుదమా యని పోలీసు లాలోచించుచుఁ గూరుచున్నపు డాదవిన విలంబమున వాల్ జీక తా నేమిచేయవలయునో నిశ్చ యించుకొనెను. అంతట కోజెత్తును గట్టిగాఁబట్టుకొని యొక సందు దూఱెను. ఆ పిల్ల అతనితో నడవఁజాలకపోయెను. అంత వాల్ జీక దాని నెత్తుకొనెను. ఆ సందున జనసంచా రము లేదు. వెన్నెలకావున దివియలు లేవు. అతఁడు వడిగా నడచెను. ఆ సందతని నొక నదియొద్దకు చేర్చెను. దానిమీఁద నొక వంతెన కలదు. జనసంచారము లేదు. భాగ్యవశమున నొకబండి దానిమీఁది కెక్కుచుండెను. అతఁడు దానిని చాటుచేసికొని వంతెనమీఁద నడచిపోయెను. ఒత్తిడివలన కోజెత్తుకాళ్లు నలుఁగుచుండెను. కాన నతఁడు దాని నట దింపెను. కోజెత్తు మరల నతని చే యందుకొనెను. అతఁడు వడివడిగా నడువఁదొడఁగెను.

వంతెన దిగినపదపడి అతఁడు డాచేతి మలుపుగాఁ దిరిగిన యొకరస్తా పట్టుకొనెను. కొంచెము దవ్వరుగఁగనే యొక శూన్యప్రదేశము కనఁబడెను. అతఁ డచట నిలిచి వెనుదిరిగి చూచెను. ఎవరును లేరు. కాని అతనికి భయము పోలేదు. జేవరు లంబాడీదయ్యమని యతనికిఁ దెలియును.

పది యడుగులలో నొక సందు కనఁబడెను. ఆ సందున

బడి పోఁదలంచి యతఁడు దాని మొగన నిలువఁబడి వెనుదిరిగి చూచెను. కొన్ని నీడలు కనఁబడెను. అవి వారివే. అప్పటికి వారందఱు నా వంతెనమీఁదికి వచ్చిరి. వారు తన్నందు కొనులోపుగా ఆ సందులో నెచ్చటనో యొకచటఁ దల దాఁచుకొనవచ్చునని వాల్జీన్ ఊహించెను. కాని దైవ మతనికి కలసిరాలేదు. ఆ సందు గ్రుడ్డిసందు. దాని చివర నుండి పై కెచటికిని దారి లేదని అతనికిఁ దెలియదు. సందు చివరకుఁ బోవఁగనే తాటియెత్తున నొక యిటుకగోడ అడ్డముగా నుండెను. ఏ మాత్ర మాలస్యమైనను వారి కందక తప్పదు. వెనుకకు వచ్చినను పట్టుపడక తప్పదు. అతఁ డెడమ వైపు రస్తా చూచెను. చివర నొక నీడ. పోలీసువాఁ డొకఁ డచటఁ గాచియుండెను. వెనుకనుండి యేడెనమండ్రు భటులతో జేవరు వచ్చుచుండెను. ఆ సందడి యతనికి వినఁబడు చుండెను. వా రచటికి వచ్చుట కొక పావుగంట పట్టును.

ఇఁక నతని కాగోడ దాఁటుటయే శరణ్యము. అతఁడు తులోఁ జెఱసాలనుండి పలుమాఱు తప్పించుకొని పోవుట కెన్నియో విద్యలు నేర్చెను. ఎంతయెత్తయినను సరే, నిచ్చెనతోఁ బనిలేక, గోడల కోణము నిఱుప్రక్కల బుజములతోడను, మోకాళ్లతోడను నొక్కిపట్టుకొని వాని బలమున నవలీలగాఁ బయి కెక్కిపోవుట యావిద్యలలో నొకటి. అతఁ డా విద్యాబలమున నాఱవ అంతస్తుమీఁదికయినను నెగబ్రాఁకి పోఁగలఁడు.

తా నొక్కఁడేయైనచోఁ బోవఁగలఁడుకాని కోజెత్తు నెటు లెత్తుకొని పోవఁగలఁడు? అతని కొక త్రాడు కావల

యును. వానికిఁ గనుక రాజ్యమేయున్నచో నిపు డొక త్రాటికి దాని నిచ్చివేయఁగలఁడు!

అతనికి ధైర్యము పోయెను. దీనమైన యతని చూపొక లాంతరు స్తంభముమీఁదఁబడెను. ఆకాలమున లాంతరులు క్రిందికి దింపుటకును, బయికి లాగుటకును త్రాళ్లు వాడుకలో నుండెను. అతఁడు గభాలున నా త్రాడు కోసి కొని వచ్చెను. ఆరేయి దీపములు వెలిఁగింపరు గాన దాని యావశ్యకత యెవరికి నుండదు. అంతట నతఁ డా త్రాటిని కోజెత్తు బుజముల వెనుకగాఁ బోనిచ్చి పైకిఁ జేఁదుకొనుటకు వీలుగాఁ గట్టెను.

ఆసమయము, నాప్రదేశము, నా చీఁకటియు, నాతని తొట్రుపాటును నివియన్నియు కోజెత్తుకు భయముకలిగించు చుండెను. వెనుకనుండి యెవరో వచ్చుచున్న చప్పుడుగూడ నంతకంతకు సమీపించు చుండెను. "నాయనా! నాకు దిగులుగా నున్నది. ఎవ రా వచ్చువా"రని కోజెత్తడిగెను.

"మాటలాడకు! తెనార్డీర్ భార్య"అని వాల్‌జీన నెను.

కోజెత్తు గడగడలాడిపోయెను. అతఁ డంత నా త్రాటి కొనను నోటఁ గఱచుకొని గోడమూలకుఁ జని యినుప నిచ్చెన నెక్కినటు లా పదునెనిమిది యడుగుల యెత్తు గోడ మీఁది కెక్కిపోయెను. పిదప 'గోడకడకు ర'మ్మని మెల్లగాఁ బలికి కోజెత్తటులు రాఁగాఁ బయికి లాగుకొని యాత్రాటిఁ యాధారముననే యాబిడ్డ నావలికి దింపెను. కొంచెము దవ్వున గోడ నానుకొని యొక చెట్టుండెను. అతఁడు దాని కడకుఁ బ్రాఁకిపోయి యా చెట్టు మీఁదనుండి క్రిందికి దిగెను.

అప్పటికి జేవ రా సందులోనికి వచ్చి—"ఈ సందు గాలింపుఁడు. దీని కావల దారి లేదు. ఈవలి రస్తాను వారు వెతకుదురు" అని యిరువురు పోలీసులకుఁ జెప్పెను. అతని యనుయాయులా సందులోనికి వచ్చి చూచువఱకు అదియంత యు శూన్యముగా నుండెను. ఆ గోడ దుమికి యెవరు నావలఁ బడఁజాలరు. దొంగల సంగతు లెంత యెఱిఁగియున్నను జేవరు వాల్ జీన్ ఆ గోడ దాఁటిపోఁగలఁడని అనుమానింపలేదు.

పోలీసు లా సందంతయు వెతకినదే మరల వెతకు చుండఁగా జీన్ వాల్ జీన్ లోపలఁ గలయఁజూచెను. అదొక పెద్దతోఁట. దానికి సరియగు పోషణము లేదు. అచటనచట గ్రచ్చపొదలు, ఆవురుదుబ్బులు. అటనటఁ బూలమొక్కలు. ఆడన్నాడఁ గూరమళ్లు. దాపుల కప్పులేని యిండ్లగోడలు. దవులఁ గొన్ని మేలిండ్లు. దాపులనే యొక పాడిల్లు కలదు. కప్పుచెడిన యీ పాడి ల్లెన్ని యేండ్ల నాఁటిదో తెలిసికొన నయితి కాదు. ఇపు డది ప్రకృతి పరియాచకమున భిక్షు కునివలె నిలువఁబడి యున్నది. ఆ గోడలు నడుమ నడుమ విచ్చెను. వానిలోఁ గొన్ని చెట్లు మొలిచెను. అందువలన నా యింట నెవరును కాఁపుర ముండుట లేదని తెలియుచునే యుండెను. కావున వాల్ జీన్ కోజెత్తు నెత్తుకొని గోడల నడుమకుఁ దీసికొనిపోయి యచటఁ బరుండఁబెట్టెను.

పుండువంటి చలి యపుడు గజగజలాడించెను. కోజెత్తు చలికిఁ దాళలేక వాల్ జీన్‌ను కోఁతిపిల్లవలె పట్టుకొని పరుండెను. చిన్నప్పటినుండియు దాస్యమున బ్రతికిన దగుట వలనఁ గష్టములనోర్చు టా బాలిక కగ్గుతోఁ బెట్టినది.

కావున నోరు తెఱచి యేమియు ననలేదు. అప్పటికిని గోడ యావల పోలీసువారి యార్భాట మడఁగక వినిపించుచునే యుండెను. కానఁ దమ యవస్థయు నా పిల్ల తెల్లముగాఁ దెలిసి కొనఁగలిగెను. దానఁజేసి చాంచల్యము ప్రకటించి విపత్తును పిలిచి తెచ్చుకొనలేదు.

కొంతసేపటికి గోడ యావల పోలీసువారి పాదరక్షల ప్రచండధ్వను లాఁగెను. తోఁటలోపలినుండి విపత్తు రాఁగల దను అనుమితిలేదు. కావున వాల్‌జీన్ 'అమ్మా!' యని పిలిచెను. ప్రత్యుత్తరము రామి నతఁ డా బాలికను తాఁకి చూచెను. కాలుసేతులు మంచుకంటెఁ జల్లగా నుండెను. అతఁడు త్రొక్కటపడెను.

అపుడు మూకమగు ప్రకృతిని ముఖరిత మొనరించుచు భగవద్గానము వినఁబడెను. మాట వినరాదుగాని పాట దివ్యముగా వినవచ్చుచుండెను. కిన్నరీకంఠమునుండి వెలువడుచున్న యా ప్రార్థనాగీతి యాతని హృదయమును ద్రవింపఁజేసెను. దవుదవుల నున్న యా మేలింటినుండి యా ధ్వని వెలువడుచున్నటులు తెలిసెను. దానవుఁ డంతర్థానము చేసిన పిదప దైవము కానఁబడినటు లతఁడు సంతసించి "ఓరీ! నీకిఁక భయములేదు" అని యినుమాఱు లనుకొనెను. అతఁడు వెంటనే మోఁకరించి ధ్యానము చేయఁదొడఁగెను. అతనినిఁ జూచి కోజెత్తుకూడ చలికి వడవడ వడఁకుచున్నను మోఁకరిల్లఁబడెను. ప్రార్థన చేసినయెడల భగవంతుఁడు తమ భయమును బాఱఁద్రోలఁగలఁడని యా బిడ్డ నమ్మకము.

గాన మాఁగెను. ఎంతసేపది ప్రవర్తించెనో వాల్

జీన్ ఎఱుఁగఁడు. ఆనంద మెంతసేపున్నను ఒక నిముష ములో ఐపోయినటు లనిపించును. దుఃఖము కొలఁదికాల మున్నను చాలఁ గాల మనుభూత మయినటులు తోఁచును.

ఎక్కడను చప్పుడు లేదుకాని చలి యెక్కుడగుటచే కోజెత్తుకాలుసేతులు కొంకరలువోయెను. ఆ బాలిక తనను అనుకొని కనులు మూసికొనుటచే నిదుఁపోయి యుండునను కొని "నిద్ర వచ్చుచున్నదా తల్లీ?" అని అడిగెను.

"లేదు. చలి పెట్టుచున్నది నాయనా!"

వాల్ జీన్ తన కోటుతీసి కోజెత్తుకు తొడిగి—

"ఇపుడు తగ్గినదా?" అని అడిగెను.

"తగ్గుచున్నది."

అపుడు దాపున గంటలమ్రోఁత యొకటి వినఁబడఁ దొడఁగెను. తోఁటలోపలితట్టునుండియే యీ మ్రోఁత మెలమెలగా వచ్చుచున్నటు లుండెను. మ్రోఁతదెసఁ జెవి యొగ్గఁగా నెవరో యొకరు వచ్చుచు నేలమీఁద నేమేమో చూచుచు నున్నయటులు వాల్ జీన్ కుఁ గానిపించెను.

"కష్టములు నన్ను వదిలిపోఁజాలకున్నటు లున్నవి. మానవులమీఁద విశ్వాసము మరల సన్నగిలుచున్నది. ఇతఁడు నన్నుఁ జూడఁగనే 'దొంగ దొంగ' యని కేకలు పెట్టవచ్చును. పోలీసువారువచ్చి నన్నుఁ బట్టుకొనవచ్చును. ఓయి దేవుఁడా! ఈ కోజెత్తుగతి యేమగును?" అని యతఁ డా బాలికను జూచెను. దాని ఉచ్ఛ్వాస నిశ్వాసము లలో పటుత్వము లేదు. మేన వేఁడిలేదు. నెగడివేయనిచో నిఁక బ్రతుకదు. కావున వాల్ జీన్ గబాలున నా మను

ష్యునికడకు వెళ్లి "ఇవిగో నీకు నూరుఫ్రాంకులు బహుమానము" అని చేయెత్తెను.

"అమ్మో, నూరుఫ్రాంకులే!"

"ఔను! నూరుఫ్రాంకులు. నాకును, నా బిడ్డకును శయనించుట కవకాశము కలుగఁజేయవలయును."

ఈ మాటలు విని ఆ మనుష్యుఁడు సమీపించిచూచి "చుక్క తెగి పడ్డట్లు లౌరా మసియోన్ మాదలేనా!" అనియనెను. వాల్ జీన్ కొంచెము సంచలించెను.

"అయ్యా! తమ రెటు లిచటికి రాఁగలిగితిరి? ఆకాశమునుండి ఊడి పడితిరా? మీ రెపుడో యొకపుడిచటికి రాఁగలరని అనుకొనుచునే యుంటిని. మీ రిటులుంటిరేమి? కోటులేదు, టోపిలేదు. కోయిల వన్నెయు కొక్కెర వంకరయుఁ జెందితిరేల? నేను మిమ్ముల లోఁగడ నెఱిఁగియుండని యెడల భయపడిపోయియుందును. అదియటుండె. తమ రెటనుండి వచ్చితిరి?"

"అయ్యా! తా మెవరు? ఈ యిల్లెవరిది?"

"మఱచితిరా? మీరే నన్నిటఁ జొరఁబెట్టితిరి."

"నాకు గుఱుతు లేదు. నన్నెటులు గుఱుతుపట్టితిరి?"

"మీరు నాకు ప్రాణదానము చేసితిరి."

అపుడు మబ్బు తొలఁగి చంద్రుఁడు ప్రకాశించెను. వాల్ జీన్ చూచి 'ఫోశెల్వాఁ!" అనెను.

"చిత్తము. నన్ను తమ రీ 'కాన్వెంటు' లో తోఁటమాలిగాఁ బంపితిరి. ఇచటి 'నన్‌లు' (Nuns) మగపురుగును జూడరు. దాన నాకాలికి కొకగంట. నా చప్పుడు

విని వారు నైతొలఁగుదురు. ఇపుడు మంచు కురియుటచే కూరలును, ముల్లంగిదుంపలును చెడిపోయెనేమోయని చూడవచ్చితి."

"ఫోశెల్వాన్! వెనుక నీ ప్రాణములు నేను కాచితిని. ఇపుడు నీకు వంతువచ్చినది."

"ఇంతకంటెనా? నా యదృష్టము పండినది. నేనేమి చేయవలయునో చెప్పుటమాత్రము మీ వంతు."

"మీకు విడిగా గది యున్నదా?"

"ఆ. మూఁడు గదులున్నవి. కాని ప్రాంతకొంప. చాలఁ జాటుగా నుండును. అట కెవరును రారు. తమబోటివారి కది పనికిరాదు."

"అదియే ప్రకృతావస్థకు పనికివచ్చు" నని ప్రకృత విషయ మంతయు వాల్ జీన్ ఫోశెల్వాన్‌కు చెప్పివయిచెను. అతఁడు మఱిమాటాడక నెగడివేసి ఒక యరగంటలో కోజెత్తుకు వెచ్చకలిగించెను. అంతట వా రా బిడ్డతో ఫోశెల్వాన్ ఉన్న గదులలోనికిఁ జనిరి. కోజెత్తొక పఱుపుమీఁద నిదిరించెను. ఫోశెల్వాన్, వాల్ జీనులు ఇంత యెండుగడ్డి పఱచుకొని దానిమీఁదఁ బరుండిరి. వారిరువురును లోలోపల నేమేమో యూహ లల్లుకొనుచుండిరి. వారికి నిదుర పట్టలేదు.

వాల్ జీన్ ఇట్లనుకొనెను: "ఇచట ఫోశెల్వానుకుఁ దక్క నింకొకరికిఁ బ్రవేశము లేదు. నా కిచట నునికి దొరకినచోఁ బ్రతికిపోదును. పోలీసు లిందుఁజొరరు. కాని నా కెట్టులు వీలుకలుగును?"

ఫోశెల్వాన్ ఇటులనుకొనెను—"నే నిటకు వచ్చిన నాఁటనుండి నేఁటివఱకును మసియోన్ మాదలేను ముచ్చట వినలేదు. వీరి కేమి చిక్కులు వచ్చెనో తెలియలేదు. ఇవు డందఱును రాజ్యవిప్లవమును తీసికొనిరాఁ దలఁచుచున్నారు. వీరుగూడ నా విప్లవమునఁ జేరియుండరుకద! పైఁగా ఈయన కొకకూఁతురు! కూఁతురో లేక మనుమరాలో? ఈ మాట లోఁగడ విననేలేదు. అగుఁగాక. నాకు ప్రాణాపాయము వచ్చినపుడు వీరింత యాలోచించుకొనిరా? నేనుమాత్రము వీరి కాపద వచ్చినపు డేల వెనుకముందాడవలయును?"

ప్రభాత మాయెను. కాన్వెంటునుండి గంటల చప్పుడు వినఁబడఁగా వాల్‌జీన్ ఈగంట లెందుకు కొట్టుచున్నారని ఫోశెల్వాను నడిగెను.

నన్‌లలో నొక తెకు జబ్బుగా నున్నదనియు, నామె చనిపోయి యుండు ననియు ఫోశెల్వాఁ చెప్పెను.

మఱియొక తీరుగా గంటలు మ్రోఁగఁదొడఁగెను. "ఈ గంటలు నన్ లందఱకును పిలుపు. వా రిపు డందఱును గలిసి ఆలోచింతురు కాఁబోలు"నని ఫోశెల్వాఁ అనెను.

"నాగతి యేమి? నే నిఁక నిట నుండుటకు వలను పడదా?" అని వాల్‌జీన్ అనెను. జిత్తులమారి ఫోశెల్వాఁ— "అయ్యా! మీ రొకతూరి బయటఁబడినచో మరల మిమ్ము లోపలికి రావించుట కుపాయము పన్నఁగలను. మీరు లోపలి కెటులు రాఁగలిగితిరో దయయుంచి చెప్పితిరి కారు. స్వర్గమునుండి దిగివచ్చితిరని నేను సరిపెట్టుకొందును గాని యీ నన్ లో పెంకెవాండ్రు! సింహద్వారమునుండియే

యిట కెవరి కేని ప్రవేశము. ఇంకొక దారి సింహాస్వప్నము. పిల్లదానికి పరవాలేదు. పండ్లబండిలోఁ బరుండఁబెట్టి గడ్డి కప్పి బయటికిఁ దీసికొనిపోఁగలను. నా తమ్ముని కూఁతురని చెప్పి మరల లోనికిఁ దీసికొని రాఁగలను. తమ కిష్టమగునేని ఈ కాన్వెంటులోఁ జేర్పింపఁగలను. కాని తమమాట..." అని అనుచుండఁగా మరల మూఁడుగంటలు వడివడిగా మ్రోఁగెను. ఆ గంటలు ఫోశెల్వాన్ కు పిలుపు!

"అయ్యా! నేఁ నిఁకఁ బోవలెను" అని ఫోశెల్వాన్ కాలిగంట మ్రోరయుచుండఁగా కుంటుకొనుచుఁ బోయెను.

'ప్రయొరెస్' (Prioress) తనకొఱకు నిరీక్షించుచుండఁగా ఫోశెల్వాన్ పోయి వందనముచేసెను. ఆమె అతనినిఁ జూచి—"ఇంతకుముందే యొక నన్ చనిపోయెను. ఇచటఁ జనిపోయిన నన్‌లను ఈ చర్చి ప్రక్కనున్న నేల కొట్లలోఁ బాఁతిపెట్టుట యిక్కడి యాచారము. కాని యిపు డేలినవారు ఈ యాచారమును నిరాకరించిరి. కావున వారి కన్నుగప్పి యామె నిచటనే పాఁతిపెట్టవలయునని నా కోరిక. నేలకొట్టుమీఁది ఱాతిబండను నే నొక్కఁడనె నెత్తఁజాలను. మఱియు సర్కారువారి బండిమీఁద ఉత్తశవపేటికను బంపవలయును. ఇదియు నా చేతఁగాని పని. ఇందు నీ సాయము నాకుఁ గావలయును" అని యనెను.

ఫోశెల్వాన్ అంగీకరించుచు—"ఉత్తశవపేటిక బలువుండదు. మనము సులువుగా పట్టుపడిపోవుదుము. కావున దాన మట్టి పోయవలయును" అని యనెను.

"భేష్! మంచి ఉపాయము. నీకిది తోఁచినందులకు

వందనములు చెప్పవలెను. ఈ సంగతులు గుప్తముగా నుంపవేడుచున్నాను'' అని ఆమె యనఁగా నతఁడతి వినయముగా—''అమ్మా! నాదొక మనవి. నాకొక తమ్ముఁడున్నాఁడు. అతని కొకకూఁతురు కలదు. అతఁడు బలిష్ఠుఁడు, కర్మిష్ఠుఁడు, అచంచలుఁడు. నా యింటిలో నతనికిఁ గూడఁ దావు చేయవలయును. అతఁడు కూడ నున్నచో తోఁటలో నెంతపని తేలునో చూచుకొందురుగాక'' అనెను.

''సరియె. ఆ పిల్లమాట?''

''ఆ పిల్లను తమ కాన్వెంట్ పాఠశాలలోఁ జేర్చుకొనిన నా తమ్ముఁ డెంతయో సంతసించును.''

''అటులగునేని రేపకడ నీ తమ్ముని నా కడకుఁ బంపుము. తప్పక చేర్చుకొందును.''

ఈ ప్రసంగము ముగిసినపిదప ఫోశెల్వాన్ వెనుదిరిగి వచ్చి వాల్‌జీన్ కీ సంగతి యంతయుఁ జెప్పి ''మీ రిటనుండి పోవుట యెటులు? మీరు వచ్చిన దారిని బోశెరా?'' అని యడిగెను. ఆ గ్రుడ్డిసందు రస్తామీఁద పోలీసుల కాఁపుండి తీరునని వాల్‌జీన్‌కు భయము కావున ''అది అసంభవము'' అని కొంత సేపాఁగి ''శవపేటికలో మన్ను పోసిన యెడల నెత్తుటలోను, దింపుటలోను జరజర జరుగును'' అని అనెను.

''అగును. నాకు వేఱు ఉపాయము తోఁచలేదు. మీ కేమయినను తోఁచెనా?''

''ఆఁ. వారు శవపేటికలో నన్నుఁ గొంపోదురుగాక.''

ఘోరమగు నీ యుపాయమును విని ఫోశెల్వాన్ 'మోదలేనుకు పిచ్చియెత్తలేదుగద' అని యనుకొనెను.

కాని కొంచె మాలోచింపఁగా నీ యుపాయము మంచిదే యని తోఁచెను. అటుతరువాత నీ యుపాయము నెటులు నెఱవేర్పవలయునో వా రిరువురును గలిసి యాలోచించిరి. వారి యాలోచన యిది. వాల్ జీన్ ఆ రాత్రి ఫోశెల్వ్యాన్ చాటున కాన్వెంటులోనికిఁ బోవలయును. శవపేటిక యున్న గదికి ప్రక్కగా నొక చిన్నగది కలదు. వాల్ జీన్ అందు దూటి ఆ రేయి గడపి తెలవాఱకముందే శవపేటికలో ప్రవేశించవలయును. ఫోశెల్వ్యాన్ శవపేటికకు రెండు రంధ్రములు చేయవలయును. మూఁత వదులువదులుగా నమర్పవలయును. శ్మశానమునఁ బ్రార్థన జరిగినపిదప శవపేటికపై మట్టిపోయువానిని ఫోశెల్వ్యాన్ పానశాలకుఁ గొనిపోవలెను. అచట తిక్కపుట్టునటులు వానిచేఁ ద్రావింపవలెను. అపుడు "నీ బదులు నేను మట్టిపోయుదు" నని చెప్పి ఫోశెల్వ్యాన్ ఆ మట్టిపోయువాని నింటికిఁబంపి తాను మరల శ్మశానమున కరిగి పెట్టెనుండి వాల్ జీన్‌ను పైకిఁ దీయవలయును.

ఈ యుపాయము వినుటకు సొంపుగనే యున్నది కాని చాల నపాయములతోఁ గూడియున్నది. అటు లయ్యును శ్మశానాంతమువఱకు బాగుగనే వ్యాపారము జరిగిపోయెను. శవపేటికను గోఁత దింపిరి. పురోహితుఁడు ప్రార్థన ముగించెను. ఫోశెల్వ్యాన్‌నును, మట్టిపోయువాఁడునుగాక తక్కిన వారందఱు వెళ్లిపోయిరి. ఈ మట్టిపోయ వచ్చినవాఁ డొక క్రొత్తవాఁడు. ఐనను ఫోశెల్వ్యాన్ భయపడలేదు. అతఁడు తనతోఁ ద్రాగుటకు వచ్చుననుకొనెను. కాని వాఁ డందుల కొడఁబడక పాఱఁడుమట్టి నా పెట్టెమీఁదఁ బోసెను.

ఈ ప్రసంగమంతయు వాల్‌జీన్‌కు వినఁబడుచునే యుండెను. ఇఁకఁ దనకు బలవన్మరణము తప్ప దనుకొనెను. అతఁడు మూర్ఛిల్లెను. ఫోశెల్వాన్ పని ఐపోయెను.

మట్టిపోయువాఁడు వడివడిగా రెండుమూఁడు పాఱల మన్ను గోతిలోనికి విసరెను. అపు డతని జేబునుండి యొక చీటి విసురుగా వచ్చి ఫోశెల్వాన్ మీఁదఁ బడెను. వెంటనే ఫోశెల్వాన్ కొక యుపాయము తట్టెను. ఫోశెల్వాన్ అతనితో "అయ్యా! చాల జాగయిపోయినది. ఇఁకఁ బది నిమిష ములలోఁ దలుపులు మూసికొనెదరు. మీ చీటి ఉన్నదా?"

"ఆఁ. లేకేమి?" అని అతఁడు జేబులో చేయివెట్టి—"అయ్యో! ఇంటికడ మఱచియుందును. ఇది పోయినచో తొమ్మిది ఫ్రాంకులు దండుగ యిచ్చుకొనవలసి యుండును."

"మంచిపనియే చేసితిరి. వెంటనే పరుగెత్తి దానిని దెచ్చికొనుఁడు. నేనిచట మీ కొఱకు వేచియుందును. మీరు వచ్చిన పిదప మీకు సాయము చేయుదును లెండు."

"నాపాలిటి దేవుఁడవయ్యా!" అని అతఁడు పరువెత్తెను. వాఁ డటు వెళ్ళఁగనే ఫోశెల్వాన్ గోతిలోనికి వంగి—"మాదలేనూ!" అని పిలిచెను.

ఎక్కడి మాదలేను! మాట లేదు. ఫోశెల్వాన్ గోతిలోనికి మెల్లగా దిగి మన్ను త్రోసివైచి పెట్టెతలుపు తెఱచెను. ప్రాణములేని యా శరీరమును జూచి యతఁడు గడగడలాడిపోయెను. "ఇంత యాలస్యము జరిగినయెడల నితఁడు చనిపోవునని నేనూహించి యుండవలెను" అని యతఁడు విలపించుచుండఁగా వాల్‌జీన్ కొంచెము కదలి

రెప్ప లెత్తెను. ఫోశెల్వాన్ సంతసమునకు మేర లేక పోయెను. అతఁడు వాల్జీన్ వీఁపుక్రింద చేతులు సైచి మెల్లగా పయికెత్తెను. వాల్జీన్ కిపుడు గాలి దొరకెను. అతఁడు కోలుకొని వెంటనే లేచి పయికి వచ్చెను. వా రిరువురును గలిసి యా గోతిని గబగబ పూఁడ్చి ద్వారము కడ కేఁగి చీటి చూపి శ్మశాన ప్రాకారమునుండి నిర్గమించిరి.

ఫోశెల్వాన్ అచటినుండి మట్టిపోయువాని యింటి కేఁగెను. అతఁడింకను చీటి కొఱ కిల్లంతయు గాలించు చుండెను. అది గని ఫోశెల్వాన్—"అయ్యా! మీ యాలస్యము గాంచి నే నా గోయి పూఁడ్చుచుండఁగా ఈ చీటి దొరకెను. మీ రచటఁ బాఱవైచుకొని యుందురు" అని యాచీటి దీసి యీయఁగా నతఁడు చాల సంతసించెను.

అంతట ఫోశెల్వాన్ కొజెత్తును తాను చెప్పినటులు తీసికొనిపోయి పండ్లమ్ముదాని యింట నుంచెను. వాల్జీన్ అచటి కేఁగి యా బాలికను గొనివచ్చి ప్రయొరెస్ (Prioress) చేతిలోఁ బెట్టెను. ఒప్పందల చొప్పున నామె కొజెత్తును కాన్వెంటులోఁ జేర్చుకొని వాల్జీనను ఫోశెల్వానునింట నుంచుటకు సెల వొసఁగెను. ఈ రీతిగాఁ గొన్ని యేండ్ల పాటు వాల్జీన్ అచట నుండఁగలిగెను.

## ౨

ఈకథ జరుగు కాలమున పారిస్ నగరము చిట్టచివర దరిద్రులు నివసించు నొక ప్రదేశమున పాడుపడిన పెద్దమేడ యొకటి యుండెను. అ దొక ముసలియామెది.

మేడమీఁద నొక గదిలో మార్ర్యిస్ అను యువకుఁ డొకఁ డద్దె కుండెను. మఱియొక గదిలో జోంద్రెత్ కుటుంబ మద్దె కుండెను. జోంద్రెత్ దంపతులును, వారి కూఁతుం డ్రిరువురును, వెరసి నలుగు రాగదిలో నుండిరి. వారికొక కుమారుఁడు కలఁడుగాని వాఁడు తఱచుగా ఊరిమీఁద నే యుండును. ఎపుడయినను చుట్టపుఁ జూపుగా వచ్చి చూచి పోవుచుండును.

ఆమేడలో మిగిలిన భాగము లన్నియు కూలి, మీఁదఁ బడునటు లుండుటఁ జేసి యెవరు నం దద్దె కుండరు. మార్ర్యిసు దాదా పిరువ దేండ్లవాఁడు. అతఁడు కాలేజిలోఁ జదువుచుండెను. అతని తాత జిల్ నరమాన్ చాల ధనికుఁడు. మార్ర్యిసు తండ్రి పన్ మేర్సీ. అతఁడు ఒకటవ నెపోలి యన్ క్రింద పని చేసెను. ఇది జిల్ నరమాన్ కిష్టము లేదు. తండ్రి రాజపక్షము. కొడుకు విప్లవ పక్షము. దానఁ జేసి పితాపుత్రులు విరోధు లయిరి. తండ్రి కొడుకు నింటినుండి వెడల నడచెను. వాటర్లూయుద్ధక్షేత్రమున పన్ మేర్సీ చూపిన పరాక్రమము జగద్విదితము. జిల్ నరమాన్ కిదియు నెక్కువ కోపమునకు కారణ మాయెను. తుదకు పన్ మేర్సీ కట్టగుడ్డలేక, తినఁ దిండి లేక మలమల మాఁడి పోవుచున్నను ఆ తండ్రిహృదయము కరఁగలేదు. ఇట్లు పన్ మేర్సీ చనిపోవుచు మార్ర్యిసు కొకచీటి యిచ్చెను.

"నాయనా! వాటర్లూ పోరాటమున తెనార్డీరను సైనికుఁ డొకఁడు నాకు గాయము తగులఁగాఁ జూచి మిక్కిలి పరిచర్య చేసెను. నీ కతఁ డెపుడేని కానఁబడిన

యెడల నీచేతనగు సాయము చేయునది.''

ఈ చీటి యాతయు మార్క్యాసుకు కంఠపాఠము. పుట్టి బుద్ధి యెఱిగినది మొదలు మార్క్యాసు కష్టజీవనము చేయుచుఁ జదివికొనుచుండెను. ఎపుడు చదువు ముగియునా, ఎపుడు పొట్టపోసికొందునా యని యతఁడు తహతహలాడుచుండెను.

చదువొకటియే యతని మానసము నాక్రమింపలేదు. ఇపుడు వలపొకటి. ఇందుఁగూడ నతఁ డంత యదృష్ట వంతుఁడు కాలేదు. క్రీడోద్యానములలోఁ దాఁజూచిన సుందరి పేరాతఁ డెఱుఁగఁడు. ఆమె వెంట నొక వృద్ధుఁడుకూడ వచ్చుచుండును. అతఁడామెతండ్రి కాఁబోలు. వారొక బల్లమీఁదఁ గూర్చుందురు. మార్క్యాసు వారి ముందునుండి పైకిఁబోయి కూర్చుండును. మార్క్యాసా సుందరి కేసి చూచును. వారి యునికి యెచటనో వానికిఁ దెలియదు. కొన్నాళ్ళనుండి వారేయుద్యానమునను గానవచ్చుటలేదు. అపుడు మార్క్యాసు పారిస్ నగర మంతయు గాలించెను. ఆ పాడు మేడలో నున్న వారిలో నెల్ల నా జోంద్రెత్ కుటుంబమువారు దిక్కుమాలిన వారు. వారున్న దొక పెద్దగది. దాని మూలలందు దయ్యములు దాఁగియుండు ననిపించును.

జోంద్రెత్తు సాగనారకంబము. వానిది ముడతల మొగము. ఎవఁడేని వాని నెత్తిమీఁద గ్రుద్దిన యెడల నా ముడతలనుండి క్రౌర్యమును, జిత్తులును ఊడిపడును. చింతాకంతలేసి కన్నులలో శీతాద్రులంత అసూయలును, మోసములును ఇమిడియుండును.

అతని భార్య పందుకొక్కు. ఆమె యొక చిన్న గడ.

ఆమె కావి వెంద్రుకలు జనపనారకు తిరిగెను గాని నేఁటి కిని ఆమెలో రాక్షసిబల మున్నది. ఇటులయ్యు నామెకు మగనియెడ భయము మెండు. ఆమె కడుఁ బతివ్రత. వేయేల, యాతఁ డెంత చెప్పిన నామె యంత.

ఆఁడు పిల్లలలోఁ బెద్దదానికిఁ బదునాలేండ్లు. చిన్న దానికిఁ బదునాలుగు. వారి కేనాఁడును కడుపు నిండ కూ డుండదు. కాన వట్టి యెముకల గూఁడులు. వారి చేతులు కంద యెఱుపుగా నుండుటయే కాక యుబ్బియు నుండును. చాలీ చాలని కట్టుగుడ్డలు. తలిదండ్రు లీయాకారముతో వారిని వీథులలోఁ దిరుగఁ బంపుటవలన వారు వాడని మాటలును, దిరుగని బాటలును లేవు.

ఈ కుటుంబమునకు యాచనమును, దొంగతనమును వృత్తి. ఇట్టి వారు ఏ పట్టనమునఁ జూచినను గనిపింతురు. ఈ కుటుంబమున మఱియొకని పేరు చెప్పమఱచితిని. వాని పేరు గావ్రోష్. వీఁడు జోండ్రెట్ దంపతులకుఁ గడగొట్టు బిడ్డఁడు. వీనికి పదునాలుగేండ్లు. తల్లికి వీని పొడ గిట్టదు. వాని నింట నుండనీయదు. కావున వాని బ్రతుకు బజారులో. పడుక పార్కులో. ప్రతిభ పోలీసులలో. ఇతఁడు రెండు మూఁడు నెలల కొకసారి తలిదండ్రులఁ జూడవచ్చును. మంచి తెలివితేటలు కల యీ యల్లరి పిల్లకాయ నీయింట రమ్మను వారుగాని, పొమ్మనువారుగాని లేరు.

చాలఁ గాలమునుండియు విద్యయందును, పిదపఁ బ్రేమయందును మునిఁగి తేలుచున్న మారియసుకు తన గది ప్రక్క నింకొక గది యున్నదనియే తెలియదు. ఒకనాఁటి

ప్రొద్దున నతనికిఁ దన గదితలుపు తోసిన చప్పుడు వినఁబడెను. అంతట నతఁడు 'లోనికి రండు' అని అనెను. చింపిరి గుడ్డలలో నెముకల గూఁడొకటి బెత్తమువంటి చేతిలో నొక చీటి పుచ్చుకొని లోనికి వచ్చెను. ఈ యెముకలగూఁడు జోంద్రెత్తు పెద్ద కూఁతురు. దీనికి నదరు బెదరులు లేవు. సిగ్గు సిరము లంతకంటె లేవు. ఆ కన్య తాఁ దెచ్చిన చీటి మార్విసు కిచ్చి యా గది యంతయుఁ గళ్ళుముగాఁ దిరుగుచు నందుఁ గనఁబడు ప్రతివస్తువును వింతగాఁ జూచుచుండెను.

పొగాకు కంపు కొట్టుచున్న యా చీటి మార్వి సిటులు చదివికొనెను:

"కలుపుగోలుతనము కల నా పొరుగు చిన్నదొరకు విధేయుఁడును జదువరియునగు జోంద్రెత్తు చేయువిన్నపములు.

అయ్యా! తమకు నా మీఁద దయ అని విన్నాను. కావున నాలుగునెలల వెనుక నే నీయవలసిన యాలుగు నెలల యద్దె తమరు చెల్లించితిరి. అందువలన మీరు కలకాలము చల్లగా నుండవలెనని దీవన లిచ్చుచున్నాను. రెన్నాళ్ళనుండియు మేము నలుగురము పస్తు. ఇదిగాక నా భార్యకు జబ్బు. ఈ సంగతులన్నియు నా పెద్ద కూఁతురు మనవి చేయఁగలదు. మిమ్ముగురించి నా యభిప్రాయము తప్పుకానిచో నా యీ మాటలకు మీ గుండెలు కరఁగి నాకు సాయము చేయవలయు నను కోరికగలిగి తమకు తోఁచిన ధర్మము చేయుదు రని నమ్ముచున్నాను.—జోంద్రెత్."

ఈ యుత్తరమునుండి చదువు లుట్టిపడుచుండుట

లేదని తెలిసియు మార్క్విసు వారి లేబరమునకు వగచి జేబులు తడుముకొనఁ దొడఁగెను. అపుడా కన్య యేల పాట యొకటి యందుకొనెను. "ఏమిటీ! నీకు పుస్తకా లున్నవే! చూడు నా దెబ్బ. నేనును చదువఁగలను" అనుచు నా కన్య యొకపుస్తకము తీసి "వానిసైన్యము వాటర్లూక్షేత్రమునఁ జాలఁ బరాజయము పొందెను" అని చదివి, పిమ్మట 'మా నాయనగూడ వాటర్లూలో యుద్ధము చేసెను. 'మేము నెపోలియన్ తరపువార' మని ఆయన అప్పుడు మా సంగతులే చెప్పుచుండును" అనెను.

మార్క్విసు వ్రేళ్ళకొక యిదుఫ్రాంకుల నాణెమును, నొక పదునాలు సౌల నాణెమును ('సౌ' అనఁగా సుమారు ఒక కాసీ) తగిలెను. అతఁడు పదునాలుసౌలు తన కంచుకొని యిదుఫ్రాంకులను ఆ కన్య కిచ్చెను. ఆ పిల్ల దాని నందుకొని తలుపు వేయకయే తుఱ్ఱు మనెను. అపుడు మార్క్విసు వారి నడుమగోడను పరీక్షించెను. అది యొంటియిటుకతోఁ గట్టిన పలుచని గోడ. దాని కొక రంధ్రము కలదు. బల్లమీఁది కెక్కి యా రంధ్రముగుండ ఆవలిగది చూడవచ్చును. "ఇన్నాళ్ళ నుండియు వీరి బాగోగులు చూడనయితినే. పాపము, వీరంద ఱెటులున్నారో" యని అతఁడొక బల్లనెక్కి వారి గది యంతయుఁ గలయఁ గాంచెను.

జోంద్రెత్తు కూఁతు రిచ్చిన యిదు ఫ్రాంకుల నాణె మును తీసికొని—"ఇదిగో చీటి, దీనిఁ దీసికొని చర్చికి పో. ప్రార్థన ముగించిన పిదప నిన్నుఁ బలుకరించిన ముదుసలి వానికిమ్ము. ఉత్తచేతులతో వత్తువేమో, వీఁపు కాపాడుకో;

జాగ్రత్త'' అని యొక చీటి యిచ్చెను. ఆ పిల్ల అటు వెళ్లఁగనే మార్య్సు బల్ల దిగి మరలఁ బుస్తకము పట్టుకొనెను. అంతట నెవరో వడివడిగా మెట్లెక్కి ప్రక్కగదిలోనికిఁ జొరఁబడు శబ్దము వినవచ్చెను. అతఁడు పుస్తకము కట్టిపెట్టి మరల బల్ల యెక్కెను. జోంద్రెత్తు కూఁతురు 'అతఁడు వచ్చె'నని యనెను.

''ఎవరు ?''

''ఆ ముసలయ్యయు, వాని కూఁతురును. వారంగడిలో నేవో కొనుటకు బండిలో వెళ్లి వచ్చెదరఁట.''

''నీ వీ యిల్లు వారికి సరిగాఁ జెప్పితివా ? ఎడమవైపు గదిమాట ?''

''ఆఁ. వారొక నిమిషములో రానియెడలనాపేరు...'

''వెంటనే కుంపటి చల్లార్పుము'' అని జోంద్రెత్తు భార్య కాదేశించెను. ఆమె వెఱ్ఱిగాఁ జూచుచు నూరకుండఁగా నతఁడు గబాలున నీరు కుమ్మరించి, బొగ్గులమీఁదను, చితుకులమీఁదను బూడిద కప్పెను. అంతట నతఁడు తన చిన్నకూఁతును 'ఆ కిటికీ తలుపును గ్రుద్ది బ్రద్దలు కొట్టుము' అని యాజ్ఞాపించెను. ఆ పిల్ల అందులకు జంకెను. అతఁడు గ్రుడ్లుఱిమెను. ఆ బిడ్డ యిఁక వెనుజూడక కిటికీయద్దమును తన పిడికిట విసరుగాఁ బొడిచెను.

''అయ్యయో ! పిల్లచేయి తెగిపోయెను'' అని తల్లి అఱచెను. ''నాకుఁ దెలియును. అటులు కావలయును'' అని యాతఁడు పలికి ''ఇదిగో నీవు పోయి ఆ కుక్కిలో పడుకొమ్మని'' యానవెట్టి శత్రుసంహారమునకు సన్నిద్ధుఁడగు సేనా

పతివలె నలుదెసలు చూచెను. అపుడు సరిగా తలుపుకడఁ జప్పుడాయెను. జోంద్రెత్తు తలుపుతీసి లోనికి వచ్చిన ముదుసలికిని, అతని వెంటనున్న కన్నియకను వినయముతో నమస్కరించెను.

వారి రాకవలన నందఱికంటె నాశ్చర్య పడినవాఁడొకఁడు కలఁడు. అతఁడు మార్యాసు. అతఁ డింకను బల్లమీఁద నెక్కియే యుండెను. అతఁ డిన్నాళ్ల నుండియు వెతకుచున్న సుందరి నిపుడెట్టకేలకుఁ జూడఁగలిగెను. ఈసుందరి యామెయే! నల్లకన్నులు, ఆపొడుగు వేనలి, ఆచక్కని నడలు, దయతోడను సిగ్గుతోడను రంగరించిన యాకవళిక యతఁ డెఱిఁగినదే. ఆమె చక్కఁగా నలంకరించుకొని యుండెను. ఆమె లోనికి వచ్చి తాఁదెచ్చిన యొక మూట బల్లమీఁదఁ బెట్టెను. జోంద్రెత్తామెను మొదటఁ బోల్చలేదు గాని ముదుసలివానిని మాత్రము పోల్చుకొనెను. తా నెన్నఁడో యాతనిఁ గాంచి నటులు జోంద్రెత్తుకుఁ దోఁచెను. అతఁడు ఆ ముదుసలికడ రోగిష్ఠియయిన తన భార్య దుఃఖగాథలు త్రవ్వి పోయుచు, పగిలిపోయిన తన యింటి కిటికీని అతని చూపుమేరకు గావించుచు, కుంపటిలో నిప్పులకుఁగూడఁ గఱవని తన నిప్పుచ్చగము వెళ్ళఁబోయుచు,—"ఇదిగో ఇతనిని తిన్నగాఁ జూడు! గుఱుతురాలేదా? ఆ పిల్లయే చుమీ యిది" అని తనభార్య చెవిలో నూఁదెను.

"ఈ అమ్మాయి చేయి యిటులు చీరుకొని పోయిన దేమి?" అని ఆ వచ్చిన పడుచు చింతించెను.

"అమ్మా! అది యొకమరలో పనిచేయుచున్నది.

అచట చేయి తెగినది. మాగతి యంతయు నిటులున్నది”
అని చెప్పి ముదుసలివాని కేసి తిరిగి—“అయ్యా! చాల నాళ్ళనుండి అద్దె యీయఁజాలకుంటిని. ఇప్పటికి అఱువదిఫ్రాంకులు లీయవలయును. ఎక్కడనేని పని దొరకునాయని వేయికనులు పెట్టుకొని చూచుచుంటిని. అది వేయికాళ్ళతో పాఱిపోవుచున్నది. ఈసాయంకాలము నే నా యద్దె యీయఁజాలనిచో నీ రేయి బజాఱులోఁ బండవలసియుండును” అని చెప్పెను.

ఆ పడుచు తాను దెచ్చిన మూట విప్పి యందలి వలువల నాకన్నెల కిచ్చుచుండఁగా ఆ ముదుసలి—“అయ్యా! నాకడ నిపుడు పైకము లేదు, సాయంకాలము తెచ్చియిత్తును” అని పదునాఱుఫ్రాంకులు జోంద్రెత్తు చేతఁ బెట్టెను. జోంద్రెత్తు వానిని గొని నమస్కారవర్షము కురిపించెను. ముదుసలివాఁడును, ఆ పడుచును సాయంకాల మాఱుగంటలకు మరల వత్తు మని చెప్పి వెళ్ళిపోయిరి. జోంద్రెత్తు, లేక తెనార్డీర్ అపుడు తన భార్యను జూచి “వారిని గుర్తింపలేదా?” అని యడిగెను.

“నీవు హెచ్చరించిన తరువాత గుర్తించితిని. కాని యీ పడుచు ఆపిల్లయేనా?” అని పండ్లు పటపట కొఱికి “అవును, అపు డెంత రోఁతగా నుండెడిదో! ఈయంద మిపు డెటులు వచ్చినదో? ఇంత యందమైన పిల్ల యీ బస్తీలో నున్నదా? ఔరా! ఆ చీర యెంత వెలకలదో? నాకర్మము! నా కూఁతుం డ్రిపుడు చినుఁగు పాఁతలు కట్టుకొని యిల్లిల్లు పట్టుకొని తిరుగవలసివచ్చినది” అని యతని భార్య యనెను. జోంద్రెత్తు తనభార్యకోపమును లక్షింపక, ఋులు విడిచి

వెళ్ళి మరల నొక యరగంటలో తిరిగివచ్చెను. మార్యసు కోజెత్తు బండివెంబడి నుఱికి యుఱికి 'యిఁక లాభము లే' దనుకొని 'ఆఱుగంటల కామెతండ్రి మరల నిచటికివచ్చును గదా' యని గుఱుతు తెచ్చుకొని తనగదికిఁ జేరుకొనెను. జోంద్రెత్తు, లేక తెనార్డిర్ తన కూఁతుండ్ర నూరిమీఁదికిఁ దోలి, సాయంకాల మైదుగంటలకు మరలి రావలెనని ముదల యిడెను. అటుపిమ్మట స్వరము తగ్గించి తన భార్య కేమేమియో చెప్పెను. మార్యసు కదియంతయు స్పష్టముగాఁ దెలియలేదు కాని అతనికిఁ దెలిసిన దిది: "జోంద్రెత్తు దంపతులా తండ్రికూఁతుండ్రను లోఁగడ నెఱుఁగుదురు కాని వారు మాత్రము వీరిని గుర్తింపలేదు. మాపటివేళ వృద్ధుఁ డిచటికి వచ్చినపుడు తెనార్డిర్ వానికడ నున్న డబ్బు దొంగిలించును. మీఁదు మిక్కిలి వచ్చుచోఁ జంపివైచును. అందుల కతఁడు కొందఱు బందిపోటు దొంగలను మాటాడెను. మఱి కొందఱితో మాటాడును. అతఁ డినుపకొట్టునుండి హత్య చేయుట కుపయోగించు కొన్నివస్తువులను కొనును."

మార్యసుకు ఆ బందిపోటుదొంగల పేరులు వినఁబడ లేదు. "సముద్రుని దొరకించుకొంటినేని యీ యెత్తు నెగ్గి నట్లే" అను నీ వాక్యము మార్యస్ చెవికిఁ దాఁకెను.

అపుడు తెనార్డిర్ తన యతిథి యిచ్చిన రొక్కము తీసికొని వెళ్ళిపోయెను. మార్యసుగుండెలు గుబగుబ లాడి పోయెను. మృత్యువు తన ప్రేయసి తండ్రిని పొంచువేసికొని యున్నది. అతఁ డెక్కడ నుండునో, అతని పేరేమో తన కేమియుఁ దెలియదు. అతని రక్షించు టెటులు? అతఁడు

వచ్చువఱకు తలవాకిటనుండుచో తెనార్డీర్ కూఁతుండ్ర కంటఁబడక తప్పదు. మఱియు తెనార్డీర్ ఎవరినో ఘాతుకు లను దీసికొనివచ్చును. వారు ముందుగా తనపని నే పట్టింతురు. మార్యొసు ఇది యంతయు నాలోచించుకొనెను. అతనికిఁ జేయఁదగిన పని యొకటియే కనిపించుచున్నది. మార్యొసు వెంటనే కోటు వేసికొని, టోపి పెట్టుకొని మేడ దిగి సందుఁ దాఁటి మునిముం దగపడిన యంగడివాని నడిగి తెలిసికొని, దాపున నున్న పోలీసుస్టేషనుకు వెళ్ళి ఇన్స్పెక్టరుండు చోటు కనుఁగొని యతనిని దర్శించెను. ఇన్స్పెక్టరు పొడుగరి, బలిష్ఠుఁడు, గంభీరుఁడు. అతనిచూపులు జేబులలోని వస్తువులను పసిపట్టఁగలవు. అట్టి ఇన్స్పెక్టరు "మీరొక ఫ్రియాదునుచేయ వచ్చినటు లున్నారు. కాదూ?" అని యనెను. మార్యొసు నలువంకల ననుమానముగాఁ జూచుచు "అవును. కాని ఆ విషయము రహస్యము" అని యనెను.

"అంతయు నాకుఁ జెప్పవచ్చును."

మార్యొసు తా నెఱిఁగినదంతయుఁ జెప్పెను. ఇన్స్పెక్ట రంతయు విని "సముద్రుఁడు లేనిచో నిది జరుగ" దనెను.

"ఔను. అతఁ డీ పేరుపయోగించెను. ఇతఁ డెవఁడు?"

"ఇదియొక సంకేతము. దీనికి నలుగు రని యర్థము. సముద్రములు నాలుగుగదా! వారెవరో చెప్పుట కిఁక తీరిక లేదు. మీ యింటి తలవాకిలికి మరబీగమున్నదా? ఉన్న చో నా కిండు" అని జేవ రడుగఁగా మార్యొసిచ్చెను. దానినిఁ గొని యా యిన్స్పెక్టరు "ఈ రెండు పిస్తోళ్లు తీసికొనుఁడు. మీరు మీ స్థలమునకే పోఁయికొనియుండి సమయమునకు

ఆకాశమునఁ బేల్చుఁడు. నావచ్చుట కది గుఱుతు. ముందర మాత్రము పేల్చవలదు. దొంగవానిని కన్నములో పట్టుకొన వలయును. ఈలోపుగా నాతో పనిపట్టునేని జేవ రెచటనుండె నని యడిగి నన్నుఁ గలిసికొనుఁడు'' అని చెప్పెను.

అప్పు డా యింటి ముదియ అచట నచటఁ దిరిగి మరలఁ దనగూఁటికిఁ దాను చేరుకొను వేళ, ఆమె లోనికి వచ్చు చునే కవాటము బంధించును. మార్విసు దాని బీగమును జేవరు కిచ్చియుండెను. కావున ఆమె రాకకుముందే తాను లోని కేఁగవలసియుండుటచే నతఁడు వడివడిగా నడచిపోయి చప్పుడుచేయక తనగదిలో ప్రవేశించెను. కొంచెముసేపటి లోనే యా యింటి ముదియ వచ్చి తలుపువేసిన చప్పు డాయెను. అపుడు మార్విసు పాదరక్షలు తీసి బల్లమీఁది కెక్కి రంధ్రముగుండ చూచెను. పెద్ద యినుపకుంపటిలో రాక్షసిబొగ్గు గనగన మండుచుండెను. దాని వెలుఁగున గదిలో ఆయాయి వస్తువులు కానవచ్చుచుండెను గాని మూలలనున్న చీఁకటి దయ్యము మాత్రము తొలఁగిపోలేదు. తలుపుదాపులఁ ద్రాళ్లగుట్ట యొకటియు, నినుపముక్కల గుట్ట యొకటియు కనుపట్టెను. తాను మెట్లమీఁదినుండి పైకివచ్చి నపుడు ప్రక్కగదిలో అలికిడి వినఁబడెను. ఈ సంగతులనుబట్టి అంతయు సిద్ధమగుచున్నదని యతఁడు స్థిరపఱచుకొనెను.

కొలఁది నిమిషములలో జోంద్రెత్తు ఎచటినుండియో రెండినుపకడ్డీలఁ దీసికొనివచ్చెను. వానికి కొయ్యపిడులు కలవు. అప్పు డాఱుగంటల కొక పావుగంట తక్కువ. అతఁడు వెంటనే యిటు లాజ్ఞనిచ్చెను—

"పిల్లలారా! మీరు వేగు వెళ్లుడు. ఎపినీనూ! నీవు చూడఁగలిగినంతవట్టు ఉత్తరపు దిక్కు చూచుచుండవలెను. మన తలవాకిలి మఱవరాదు. అజెల్మా! నీవు దక్షిణపు దిక్కు. మా పనికి భంగము కలుగునని యెంతమాత్ర మనుమానము కలిగినను గాలివలెవచ్చి మాకుఁ దెలుపునది."

ఈ యాజ్ఞలను విని యాఁడుపిల్ల లిరువురును పరుగెత్తు కొనిపోయిరి. అపుడు జోంద్రెత్తు భార్యను జూచి—"ఆ యినుపకడ్డీలను కుంపటిలోఁ బెట్టుము" అని అనెను. అనఁగనే యామె వాని నా యగ్నికుండములోఁ బెట్టెను. అతఁడు మరల నిటులనెను: "లాంతరు తీసికొని కిందికి వెళ్లు. మూడమంచు పట్టినది. అతఁడు గుఱ్ఱపుబండిలో వచ్చును. వానికి మెట్లు చూపి కిరాయి యిచ్చి బండివానిని బంపివేయుము."

"డబ్బేది?"

"ప్రొద్దున మార్యొసిచ్చిన ఐదుఫ్రాంకులు నేమైనవి? ప్రసంగవశమున గుఱుతువచ్చినది. నయమే. ఇతఁ డిపు డుండఁడు. ఐనను కొంచెము జూడుము."

"ఈ సమయమున నాతఁ డెపుడును గదిలో నుండఁడు. అయినను చూతును" అని జోంద్రెత్తుభార్య బయలుదేఱెను.

మార్యొసు గబాలున బల్లదిగి పఱుపుచాటున దాఁగెను. గదిలో దీపము లేదు గాని మంచు కొంచెము విచ్చుటచే మసకవెన్నెల కిటికీనుండి లోనికిఁ బ్రసరించు చుండెను. ఆమె తలుపుతీసి యఱ్ఱు సాఁచి కలయఁగాంచి మరలఁ దలుపుమూసి తమ గదిలోనికేఁగి "అంతయు నను

కూలముగా నున్న'' దని మగనికిఁ దెలిపి క్రిందికి దిగిపోయెను. మఱునిముసములో మార్క్విసు మరలఁ దనతావునఁ గూరుచుండెను. జోంద్రెత్తు కుంపటికడ్డముగా నొక తెర లాగెను. త్రాళ్ళకట్ట విప్పి క్రిందట్టు మీఁదట్టు చేసెను. మార్క్విసుకు త్రాళ్ళతోఁ జేసిన నిచ్చెన యొకటి యందగపడెను.

గడియారమున ఆఱు మ్రోఁగెను. మార్క్విసు తన జేబునుండి ఒకపిస్తోలు తీసి గుఱ్ఱమును లాగి కుడిచేతఁ బట్టుకొనెను. వెంటనే తలుపులు త్రోసికొని జోంద్రెత్తు భార్య లోనికి వచ్చెను. ఆమె వెనువెనుకనే యా ముసలివాఁడును వచ్చెను. జోంద్రెత్తు తనభార్య నొకసారి కఱకుగాఁ జూచెను. వెంటనే యామె క్రిందికి దిగిపోయి కిరాయి యిచ్చి బండివానిని బంపివైచెను.

జోంద్రెత్తా ముదుసలి నొక కుర్చీలోఁ గూరుచుండఁబెట్టి బల్లకెదురుగనున్న యొక కుర్చీలోఁ దాను కూరుచుండెను. అంతట నా ముదుసలి జేబునుండి సంచితీసి 4 లూయీలతనికిచ్చి ''అద్దెపోఁగా మిగిలిన కొంచెము పైకము మీ సంసారమున కక్కఱవచ్చును'' అని యనెను.

ఇనుపకుంపటి కడ్డముగా తెర వేయుట వలనను, పెట్టిన దీపము మినుకుమినుకు మనుచుండుటవలనను వెన్నెలయే యిపుడా గదిలో ప్రధానదీపము. ఆ చలివెలుఁగులో ప్రశాంతమగు నా ముదుసలివానిమోము చక్కఁగాఁ గానిపించుచుండెను. జోంద్రెత్తు భార్య బండినిబంపి పైకివచ్చి తలుపు దాపున నిలువఁబడెను.

''మీ చిన్నపిల్ల చేయి యెటులున్నది?''

"నిమ్మళము లేదు. ఆసుపత్రిలో కట్టు కట్టించుటకు అక్కగారు దానిని దీసికొని వెళ్లెను" అని జోంద్రెత్తనెను.

ఆ సమయమున నెవఁడో యొకఁడా గదిలోనికి దూఱి మంచముమీఁదఁ గూరుచుండుట మార్యసు కనిపట్టెను. వాని మోము కొండముచ్చు మోమువలె కారునలుపు. తొడుగు కొనిన చొక్కాచేతు లెగఁదీసికొనుటచే బాహువులు కానిపించుచుండెను. పాదరక్షలు లేవు. వాఁడు కూరుచున్న చో టెవరికిని గనఁబడదు. అటులయ్యును ఆ ముదుసలి గ్రహించి—"వా రెవరు?" అని యడిగెను.

"పొరుగింటివాఁడు" అని జోంద్రెత్ చెప్పెను.

"తమభార్య కీ పూఁట చాలఁ దేలికగా నున్నట్లున్నది" అని యా ముదుసలివాఁడు పలుకుచు నపు డా గది లోనికి వచ్చుచున్న మఱి మూవురను జూచి "వీరును తమ పొరుగింటివా రేనా?" యనెను. వారు వెనుకటివానివలెనే చేతులు ముడుచుకొని గోడల కానుకొని మంచముమీఁదఁ గూర్చుండిరి.

"ఔను. ఈ ప్రాంతముల నున్నవా రందఱును పొగగొట్టములు తుడిచి జీవనము చేయుదురు" అని చెప్పి జోంద్రెత్తు ఒక చిత్తరువును చేతఁబుచ్చికొని దాని పుట్టుపూర్వముల గుఱించి యెన్నియో కథలు చెప్పి యెంతయో వర్ణించి—"దయ యుంచి దీనిని దమరు తప్పక కొనవలయును" అని యాచించెను. జోంద్రెత్తిటులు వాక్ప్రవాహమును పాఱించుచుండఁగా నా ముదుసలి తన కుర్చీని మెల్లగా గవాక్షముకడకు జరుపుటయు, నిసుమంతయు బెద

రక తాను తప్పకొనిపోవుట కాగది యంతయుం జూచు టయు మార్యిసు గమనించెను. "ఏది యా చిత్తరువు?" అని యా ముదుసలి యనఁగా జోంద్రెత్తు దానిని దెచ్చి ముదుసలివాని మోముముం దెత్తి పట్టికొనెను. అది యొక పానశాలకు ప్రతిబింబాభాసము. మార్యిసు కది యాఁడు దియో, మగవాఁడో తెలియలేదు. "ఇది యెంత వెల చేయు నని మీ యుద్దేశము?" అని జోంద్రెత్తడిగెను.

"మూఁడు ఫ్రాంకులు చేయవచ్చును."

"వేయి క్రౌనులు (క్రౌను అనఁగా 30 ఫ్రాంకులు) దీని కీవలెను" అని జోంద్రెత్తు తన తోడేలు చూపుచే నా ముదుసలిని నియమించెను.

"ఈయను. ఎన్నటి కీయను" అని ఆ ముదుసలి యనుచుండఁగా తలుపుకడ నలికిడి యగుటవలన నతని దృష్టి యటు మరలెను. మఱి నలుగురు మనుష్యులు. ఆ ముదుసలి యపుడు 'సముద్రముల' యెదుటఁ బడెను. వారి యందఱ మొగములనుండియు మసి యోడుచుండెను. వారి చొక్కాలుగూడ వెనుకటివారి చొక్కాలవలెనే యుండెను. అందఱ చేతులలోను ఆయుధము లుండెను. ఆ నలువురలో నొకఁడు భీముఁడు. ఆఁబోతు నొకదెబ్బన నఱికివేయఁగల గండ్రగొడ్డలి యొకటి వాని చేతిలో నుండెను. వీరు వచ్చువఱకే జోంద్రెత్తిటులు కాలయాపన మొనరించి యపుడు 'అంతయు సంసిద్ధమా?' అని ప్రశ్నించెను.

"సిద్ధము"

"బండి?"

"ఆఁ."

"ఆవల మఱియొకబండి?"

"ఆఁ."

"మంచి గుఱ్ఱములు?"

"ఆఁ."

అపుడు మంచముమీఁదనున్న యొక మూగురు లేచి యినుపగుట్టనుండి లావుపాటి చువ్వలు తలాయొకటి లాగి తలుపుకాచిరి. జోంద్రెత్తు తన యతిథికేసి తిరిగి—"నే నెవఁడనో తెలియునా?" అని గర్జించెను.

"తెలియదు" అని యా ముదుసలి శాంతముగా బదులు పలికెను.

"నా పేరు తెనార్డిర్."

ఈ మాట కతఁడులుకను లేదు, పలుకను లేదు. కాని మార్యిసుచేతిలోని పిస్తోలు జాఱి నేలమీఁదఁ బడిపోవునటు లాయెను. అపుడు మార్యిసు ఇటులనుకొనెను: "ఇతఁడు తెనార్డిరా? మా తండ్రి చనిపోవుచు 'నీ శక్తికొలఁది ఉపకారము చేయవలసిన'దని చీటివ్రాసిన దితని గుఱించియా? ఆ యితనినా నే నిప్రుడు పోలీసుల చేతులలోఁ బెట్టవలసినది? ఒకవేళ వీఁ డింకొక తెనార్డిరేమో!"

అంతట తెనార్డిర్ తనచేతులనుండి యాముదుసలివాఁ డికఁ దప్పించుకొని పోఁజాలఁ డని తలఁచి, తనకోపమున కొదవిన యవకాశమునంతయుఁ జక్కఁగా నుపయోగించుకొని—"మా యింటికి వచ్చి కోసెత్తు నెత్తుకొనిపోయి నా సర్వస్వమును నాఁచికొనినవాఁడవు నీవు కావా? నేను నిన్నెఱుఁగ

ననుకొంటివా?'' అని యనెను.

మార్వ్విసీ మాటలు విని తెనార్డీర్ మంచివాఁడనియు, వాటర్లూయుద్ధమునఁ బోరాడినవాఁడనియు, నచటఁ దనతండ్రి పన్ మేర్సీ ప్రాణములు రక్షించినవాఁ డనియుఁ దలఁచెను.

మన మా ముదుసలివానిని జీన్‌వాల్‌జీన్ అని ఎఱుఁగుదుము. అతఁ డాచిత్తరువును గోనుట కటు తిరిగినటులు తిరిగి కుర్చీని కాలితోడను, బల్లను జేతితోడను ద్రోసిపుచ్చి యొక్క యంగమీఁద గవాక్షమునుండి బయటఁబడ నుంకించెను. అంతలోఁ దలుపుకావలివా రతనిమీఁదఁబడి రెక్కలు పట్టుకొని వెనుకకు గెంటుకొని వచ్చిరి. మార్వ్విసుకు అతని ప్రసన్నతయు, సాహసమును ఎంత వింత కలిగించెనో అతని బలమును, జుఱుకుదనమును గూడ నంత వింత కలిగించెను.

ముదుసలివానిని పట్టుకొనినవారిలో నొకఁ డొకకఱ్ఱను దీసికొనెను. దాని చివర నొక సీసపుగుం డుండెను. అతఁ డా కఱ్ఱ నతనిబుఱ్ఱ పగులఁగొట్టుటకుఁ బయికెత్తెను. అపుడు మార్వ్విసు—''నాయనా! ఇఁక నన్ను క్షమింపుము'' అని పిస్తోలు మీట నొక్కఁబోవుచుండఁగా ''వలదు వలదు'' అని తెనార్డీర్ అనెను. ఆ మాటకు ఘాతకుని చేతిలోని కఱ్ఱయు, మార్వ్విసుచేతిలోని పిస్తోలునుగూడ నాఁగిపోయెను. తెనార్డీర్ మఱికొంచె మెక్కుడు తొందరపాటును, కోపమును బొందుటకు బదులు శాంతుఁ డాయెను. ఘాతకులును, వాల్‌జీన్ యును పెనఁగులాడుచుండిరి. అతఁ డొక్కఁ డయ్యును ఆ యెనమండుగురకును జవాబు చెప్పుచుండెను. అతఁ డొకనికి దిమ్మెక్కించెను. ఇరువురను నేలమీఁదఁ ద్రొక్కిపట్టెను. మఱి

యిరుపురను రోఁజుకొనునటులు చేసెను. కాని తుద కా ఘాతకు లందఱును గలిసి యతనిని బంధించిరి. తెనార్డీర్ భార్య వాల్‌జీన్ జుట్టు పట్టుకొనెను. అపుడు తెనార్డీర్ "నీ వావల నుండుము. నీ సేలువ చినిఁగిపోఁగలదు" అని తన భార్యకుఁ జెప్పుచు మిగిలినవారికిఁగూడ "విడిచి పెట్టకుఁడని" ఆదేశించెను. వాల్‌జీన్ మఱి వారితోఁ బెనఁగులాడక "నా కడ నేమి కలదో వెతకికొనుఁడు" అని పలికెను. వారి కతని జేబులో నాలుగు ఫ్రాంకులును, ఒక్క చేతిరుమాలును గానవచ్చెను. తెనార్డీర్ వానిని దీసికొనెను. అంతట వారందఱు ముసుఁగువాని రెక్కలు వెనుకకు విఱిచికట్టిరి. మంచపుఁగో[illegible]కాక కాలు బిగఁదీసిరి. తెనార్డీర్ తన బందీమున కెదురుగా కుర్చీ వేసికొని కూరుచుండి—

"నాది సబబు కాకపోవచ్చును. దాని కేమిగాని నీవు నాకుఁ బూర్తిగా వశుఁడవయిపోతివి. నీవు బుద్ధిమంతుఁడవు కావున నిది యెఱుఁగఁగలవు. నేను చెప్పినటులు చేయుదువేని నీమీఁద నీఁగవాలదు. నా కెక్కువ డబ్బు కావలెను. ఇది నా కెక్కువ కాని నీ కెక్కువ కాదు. ఇది నిక్కము. నే నిపుడు నీ కొకటి యాజ్ఞాపించుచున్నాను. నీవు నేను చెప్పినట్లు వ్రాయవలెను."

"చేతులు బిగించినచో వ్రాయుటెటులు?" అని వాల్‌జీన్ అనెను. అతని సంయమమును జూచి మార్యూసు —"ఇది కోజెత్తుతండ్రి కే తగును" అని లోలోపల మెచ్చుకొనెను. "కొంత నిజమే కాని" అని తెనార్డీర్ ఘాతకులను జూచి "కుడిరెక్క విప్పుఁడు" అని యనెను. వారు విప్పినపిదప తెనార్డీర్ వాల్‌జీన్‌ను జూచి—"నాయనుఁగు బిడ్డా! అని వ్రాయుము" అని యాదేశించెను.

"ఎవరు?" అని వాల్‌జీన్ అడిగెను.

"నీకుఁ జక్కఁగాఁ దెలియును. కోజెత్తు" అని తెనార్డీ రనఁగా ముదుసలివాఁ డది వ్రాసెను.

"ఈచీటి తెచ్చినవానితో బండిమీఁద వెంటనే నీ విచటికి రమ్ము. నీ విపు డిచటికిఁ దప్పక రావలసియున్నది."

వాల్‌జీన్ వ్రాసెను.

"నీ పేరు నే నెఱుఁగను."

"అర్బైఁ ఫేబర్."

తెనార్డీర్ అపుడు జేబురుమాలు తీసి చూచెను. దాని చెంగున అ. ఫే. అను పొడియక్కరము లుండెను.

"చిర్నామా?"

"17, దామినిక్ వీథి."

వ్రాఁత ముగిసినపిదప తెనార్డీర్ ఆలేఖను దీసి భార్య చేతి కిచ్చి చెవి కొఱికెను. ఆమెయు, ఆ ఘాతకులలో నొకఁడును గలిసి బండిలోఁ జనిరి.

అంతట తెనార్డీర్ కుంపటి కడ్డముగా నున్న తెర తొలఁగించెను. కుంపటిలో కడ్డీలు కాలి కాలి యెఱుపులు చిమ్ముచుండెను. తెనార్డీర్ కుంపటిముందు కూరుచుండి చలి కాఁచుకొనుచు వాల్‌జీఁను జూచి "వినుచుంటివా? ఇపు డాబండిలోఁ బోయినవాఁడు నీ బిడ్డను పోలీసుల కందుబాటు కాని తావునకుఁ దీసికొనిపోవును. ఇక్కడ జరుగు సంగతు లన్నిఁటిని వాని కెప్పటికప్పుడు తెలుపుట కేర్పాటు చేసితిమి. ఒకటి రెండు దినములలో నీవు రెండులక్షల ఫ్రాంకులు మా కీయవైతివేని నీ బిడ్డసంగతి యే మగునో నేను చెప్ప

కయే నీవు తెలిసికొనఁగలవు'' అని అతఁడు పలికెను.

''అయ్యయో! నే నిపుడు పిస్తోలు వదలినను కోజెత్తున కపాయము తప్ప''దని మార్వ్యూసు వగవఁ దొడఁగెను.

జీన్ వాల్ జీన్ ఇసుమంతయుఁ జలింపక కట్టుఁద్రాళ్లతో నిలిచియుండెను. మిగిలినవా రందఱు కూరుచుండిరి. సుమా రొకగంటదాఁటినపిదప తెనార్డీర్ భార్య తలుపుతీసికొని లోనికివచ్చి ''ఇతఁడు మనల వెఱ్ఱిపప్పలఁ జేసెను. అచట నీపేరు కలవారెవరును లేరు''అని చేతులు తిప్పెను.

తెనార్డీర్ వాల్ జీన్ దెసఁదిరిగి, యొకసారి కాలుచున్న కడ్డీలదెసఁ జూచి మరల వాల్ జీన్ దెసఁ దిరిగి—''ఇందువల్ల నీకేమి లాభము?'' అని ప్రశ్నించెను.

''విలంబమే లాభము'' అని యా ముదుసలి తన చేతుల రెంటిని బలముగా నూఁపెను. దొంగనాణెముచే నంతకుముందు కొంతవఱకు అతనిచే కోయఁబడిన కట్లూడిపోయెను. అంత నతఁడు వంగి కుంపటిలోని కడ్డీలులాగి రెండు చేతులతోఁడను గిరగిర తిప్పెను. అందఱును వెనుకకు తగ్గిరి.

''ఓ భీరుపులారా! మీకు నేను జడియవలసినంతగా మీరు నాకు జడియవలసిన పని యుండదు'' అని వాల్ జీన్ తన చేతిలోని కడ్డీల రెంటిని గవాక్షమునుండి వెలికి విసరెను. నిరాయుధుఁడైన వాల్ జీన్ ''ఇఁక నన్నేమి చేయఁదలఁచికొంటిరో దానిని జేసికొనుఁడు'' అని యనెను.

ఎవరికిని ఏమిచేయను దోఁపలేదు. తనతండ్రిమాట మీఁది గౌరవమును, ఉదాత్తుఁడగు నీవృద్ధుని రక్షింపవలయు నను కోరికయు మార్వ్యూసు నేమియుఁ జేయింపలేకపోయెను.

అతఁడు గ్రుడ్ల ప్పగించి చెవులు దోరబెట్టి నిలుచుండెను.

అప్పుడా గోడక్రింద తెనార్డీర్ దంపతు లిటులు మాటలాడుకొనుచుండిరి——

"ఇంక నొకటియే మిగిలినది."

"చంపివేయుటయా?"

"ఔను" అని తెనార్డీర్ ఒక కత్తితో ముందరి కడుగు పెట్టెను. ధైర్యముచెడియు మారియ్స సప్పటి కెటులయి నను కొంత ఆఁపవలయు నని తలఁచి తనగది కలయఁ గాంచెను. ఎపినీను ప్రొద్దున వ్రాసి పాఱవయిచిన కాకితపు ముక్క యతనికిఁ గనఁబడెను. అతని కేమి తోఁచెనో కాని దానిని దీసి గోడపెల్లయొకటి లాగి దానికిఁ జుట్టి ఆ కంతలో నుండి గదినడుమ పడునటులు విసరెను. తెనార్డీర్ ఉలికి పడెను. అతని భార్య దానిని విప్పెను.

"ఇది యెచటనుండి వచ్చిపడెను?"

"ఇది ఎపినీను వ్రాఁత. దీనిని జూడుము."

తెనార్డీర్ చదివికొని గంద్రగొడ్డలి కలవానితో పోలీసులు వచ్చుచున్నారని చెప్పెను. అతఁడు వెంటనే చేయెత్తి వ్రేళ్లు ముమ్మాఱు ముడిచి తెఱచెను. పాఱిపోవుట కది గుఱుతు. తెనార్డీర్ త్రాళ్ళనిచ్చెన కిందికి జాఱవైచెను. భార్యను రమ్మని తాను దిగుట కుంకించెను. అపుడు గంద్ర గొడ్డలివాఁ డతనిని లంకించుకొని "మేము ముందర మేము ముందర" అని అనియెను.

"తెలివితక్కువ పని చేయకుఁడు. అందఱము పట్టు పడిపోదుము" అని తెనార్డీర్ అనెను. వారిలో నొకఁడు

'చిప్పు వేసికొండ' మని యనెను.

"ఓరి తెలిసిమాలిన దద్దమ్మా! దానికి సమయ మిప్పుడా!" అని తెనార్డీర్ నిచ్చెనకడ కేఁగుటకు పట్టు వదలించుకొనఁ బెనఁగులాడుచు—"టోపినుండి కాకితములు తీసి చిప్పు వేయుదువా, లేక—" అని యనుచుండఁగా—"అందులకు నా టోపి అక్కఱకు వచ్చునా?" అని విశదమును, శాంతమును అగు నొక ధ్వని వినఁబడెను. అప్పు డందఱును తలుపుదెసఁ జూచిరి. అంతలో టోపి తీసి చేతఁ బట్టుకొని నగుమొగముతో జేవరు వచ్చి నిలువఁబడెను.

అచట నున్నవా రందఱును తలారయొక యాయుధమును చేబూనిరి. తెనార్డీర్ భార్య యొక నాపరాతిబండను బుచ్చుకొనెను. ఒక చిన్నలాంతితో జేవరు కొంచెము ముందఱికి వచ్చెను. వారిలో నొకఁడొక పిస్తోలును తెనార్డీర్ కిచ్చి ఇట్లనెను: "ఆయన జేవరు. ఆయననుగొట్టుటకు నేను సాహసింపను. నీవేమయిన నొకచేయి చూడఁగలుగుచో..."

"మూతము" అని తెనార్డీర్ పిస్తో లందుకొనెను. "దానిలో ప్రాణము లేదు" అని జేవర నెను. తెనార్డీర్ మీటు నొక్కెను. అది 'తుస్సు' మనెను. గంద్రగొడ్డలివాఁడు జేవరు పాదములముందా గొడ్డలిని బడవైచి "హనుమంతునిముందు కుప్పిగంతులు సాగవు. నే నిఁక మీ కధీనుఁడ" ననెను. మిగిలినవారంద ఱతని ననుసరించిరి. చాటుననున్న పోలీసులు లోపలికి వచ్చి అందఱు చేతులకును గొలుసులు తగిలించిరి.

"ఇప్పు డిఁక నా ముదుసలివాని కాలు విప్పు" మని జేవ రొక పోలీసువాని కాజ్ఞాపించి తాను దెచ్చిన కలమును,

కాకితమును, సిరాబుడ్డిని ఒక బల్లమీఁదఁ బెట్టి దానిము
దొక కురిచిలోఁ గుదురుగాఁ గూరుచుండి—"ఆ ముదుస
నిచటికిఁ గొనిరమ్ము" అని యనెను.

"ఏఁడీ? ఇది యేమి వింత! నే నిటు తిరిగినంతలో
మాయమయిపోయెను" అని ఆ పోలీసుబంటు అనుచుండఁగా
నందఱును కిటికిదెసఁ జూచిరి. ఘాతకు లుండిరి; మేఁక
మాయ మాయెను. దాదులేదు; క్రియా దెటులు?

అపుడు జేవరు గవాక్షముకడ కరిగి చూచెను.
చూపుమేర యంతయు శూన్యము. కాని నిచ్చెన మెట్లన్నియు
నింకను గడగడ లాడుచుండెను. అపుడు జేవరు—"వీఁ
డందఱ తలఁ దన్నినవాఁ డయియుండును" అని యనెను.

ఇది యిటు లాశ్చర్యముగ పర్యవసించు నని మార్విస్సు
లోఁగడనే యూహించెను. ఏలనఁగా నింతవఱకును ఈ
ముదుసలి తన సాయమున కొరలకొఱ కొకమాటును
కూయుడలేదు. జేవ రపుడు మార్విసును పిలిచెను. అతఁడు
రాఁగనే జేవరు—"ఎపినీనును అజెల్మాను నా యధీనమున
నుంచుకొంటిని. ఇన్నిగంటలు దాఁటినను మీ పిస్తోలు నన్ను
పిలువలేదు. దానివలన మీకే మొప్పము కలిగెనేమో య
వచ్చివేసితిని" అని చెప్పెను.

ఆ మఱునాఁ డొక బాలుఁడు వాకిటి తలుపులు
తట్టియు మట్టియు తందరబిందర చేసెను. మొదట నెవ
రును పలుకలేదు గాని తలుపులు పగిలిపోవ సిద్ధపడు సమ
యమున నింటి ముసలావె వచ్చి తలుపు తెఱచెను.

"నేను నా వంశవృక్షమును జూడ వచ్చితిని."




"ఆ వృక్షు మిట లేదు."

"మా నాయన?"

"బందిఖానాలో."

"మా అక్కలు?"

"సర్కారువారు పెట్టించిన బందిఖానాబడిలో."

"బళిబళీ!" యని యెలుఁగెత్తి లొల్లాయపాట యొకటి పాడుచు నృత్తము చేయుచు నా బాలుఁడు వెళ్లిపోయెను.

౮

గావ్రోషుకు ప్రొద్దుటినుండియు తిండితిప్పలు లేవు. వానికిఁ జాల నాఁకలిగా నుండెను. ఇఁకమీఁదట నేమి యె త్తెత్తుదమా అని యతఁ డాలోచించెను. వాని కపు డొక తోఁట గుఱుతుదవిలెను. అందు చొరఁబడినచో సీమరేఁగు పండ్లు దొరకవచ్చును. ఇటులు తలఁచుచు నతఁ డా తోఁటకడకుఁ బోయెను. తోఁటకర దాఁటుట వాని కొక లెక్కలోనిది కాదుగాని లోపలనుండి మాటలు విన వచ్చుటచే వాఁ డచట నక్కెను. అందొక వృద్ధుఁ డుండెను. వృద్ధుని పేరు మాబో. అతని కీ జీవితమున చదువే యానందము. ఈనాఁడు తిండికిలేక ఉన్న పుస్తక మొకటియు అమ్మివేయవలసి వచ్చెను. దానివలన నతఁ డమితముగా పరితాపపడుచుండెను.

సరిగా ఆసమయమున ఆదారిని ఇరువురు మనుజులు వచ్చుచుండిరి. మసక చీఁకటిలో గావ్రోషు వారిని జూచెను. వారిలో నొకఁడు మూఁపులు ముందుకు వంఁగిన

ముదుసలి. వాని నొక వయసువాఁడు వెంబడించుచుండెను. వారు కొంచెము ముందరికి వచ్చిరి. అతఁడా రెండవవానినిఁ బోల్చెను. వానికిని, దనకును పరిచితి కలదు. వానిపేరు పర్నాసస్. వానికిఁ బందొమ్మిదేండ్లు. అతఁడు ద్రఢిష్ఠుఁడు, బలిష్ఠుఁడు. మఱియుఁ జాలఁ జులుకయినవాఁడు. పాటుపడుట యనిన వానికి అవమానము. తెరవాటు గొట్టుట యనిన వానికి గౌరవము. వాఁడిప్పటి కిరువురఁ జంపెను.

"అయ్యో! ఈ వృద్ధు వీనిచేతిలోఁ బడిపోయెనే. నే నేమి చేయఁగలను? నేను వట్టి వ్యర్థుఁడను" అని గాబ్రోషు వగచుచుండెను. అంతలో పర్నాసను ముదుసలి వానిపైఁ బడెను. వా రిరువురకును గొంచెముసేపు ద్వంద్వ యుద్ధము జరిగెను. అంతట వా రిరువురలో నొకఁడు క్రిందఁ గూలుటయు, మఱియొకఁ డాకూలినవానిమీఁద కాలు మండె వెట్టి కూరుచుండుటయు గాబ్రోషు చూచెను. క్రిందఁ బడియున్నవాఁడు పర్నాసస్ అని తెలిసినతరువాత గాబ్రోషుకుఁ గలిగిన యాశ్చర్యమునకు మేర లేదు. కొంచెము సేపటిలో మీఁద నున్న ముదుసలి—చదువరు లితనిని జీన్ వాల్‌జీన్ అని గుర్తింపఁగలరు—క్రింద నున్న కుఱ్ఱవానిని లేవనిచ్చి, తన గుప్పిటిలో వాని రెండు చేతుల నిఱికించుకొని యిటు లనెను:

"నాయనా! నీ విట్టి పనులు చేయరాదని నీకు నచ్చఁ జెప్పుటయే నా కోరిక. ఇది నిన్నెక్కడికి నెట్టుకొనిపోవునో నీ వెఱుఁగవు. మరియాదగా పాటుపడుట యనిన నీకించదు. చూడు, నీ విట్టి పనులవలన నెచటికిఁ బోవుదువో యచటఁ

జేయవలసిన పనులవలన నీ స్నాయువులు విలవిల లాడును. నీవు చిన్నవాఁడవు. ఇది యంతయు నాలోచించుకొనుము. ఇది యిఁక నీకే వదలెదను. అది యటుండె. నీకు నా డబ్బుసంచి కావలయునా? ఇదిగో!'' అని వాల్‌జీన్ దాని నతని కిచ్చి వానిని ఆశ్చర్యచకితునిఁ గావించెను. వాఁడలవాటు చొప్పున దానిని దీసికొని దొంగతనముగా జేబులో దోఁపుకొనెను. అటుతరువాత వాల్‌జీన్ తనదారిని తాను పోఁదొడఁగెను. పర్నాసను వెళ్లుచున్న వాల్‌జీను వెఱ్ఱిగాఁ జూచుచు నిలువఁబడి పోయెను.

గావ్రోషు మెల్లగా వాని వెనుకకు తారి వానికిఁ దెలియకుండ వానిజేబులోని సంచి మెల్లగఁ దీసి తోఁట కడకుఁ బోయి కరమీఁదుగా మాబో కాళ్లముందుఁ బడ వయిచి కనఁబడకుండఁ బాఱిపోయెను. ఆకాశమునుండి పడిన యీ సంచిని మాబో తీసి చూడఁగా ఆఱు నెపోలి యను * లుం డుండెను.

గావ్రోషుకు సాహసము పరమాన్నము. ఒకనాఁటి ప్రభాత సమయమున ఫర్నాసను అతని కడకు తొందరగా నడచుచు వచ్చి, ''మా ముఠాలో నొకఁడు చెఱసాలనుండి చాలవట్టు తప్పించుకొనెను. అనఁగా అతఁడు దానిగోడ మీఁదికిఁ బ్రాఁకి అలసిపోయి మదురుమీఁదఁ బరుండెను. కొందఱు మిత్రు లతనినిఁ జూచిరి. అతని నచటినుండి దింపుట కుపాయము తోఁపలేదు. ఆ గోడమీఁది కెవఁడేని ఒక త్రాడు తీసికొనిపోవలయును. దాని నానుకొని యొక

* నెపోలియను అనఁగా సుమారు రెండున్నర రూపాయలు.

పొగగొట్ట మున్నది. కాని అది త్రుప్పు తిని యూఁగులాడు చున్నది. పెద్దవాని నది యూఁపలేదు. నీ బోటివాఁ డెక్క వచ్చును'' అని చెప్పెను.

''చూతము'' అనుచు గావ్రోషు గబగబ నడవఁ దొడఁగెను. అంతట వారిరువురును చెఱసాలకడ కేఁగిరి. అపుడు మదురుమీఁద పడుకొన్నవాఁడు తల బయటికిఁ బెట్టెను. పాలిన మొగమును, గుంటకనులును గల ఆ యాకారము చూచి గావ్రోషు—''ఇతఁడు మా నాయన. మా నాయన కానీ కాకపోనీ, నేను పయికి ప్రాఁకవలసినదే'' అనుచు పర్నాస సిచ్చిన త్రాడు తీసికొని ఒక నిమిషములోఁ బయికిఁ బోయెను. మఱు నిమిషములో తెనార్డీర్ క్రింద నుండెను. మరల వానినిఁ బట్టుకొనవలయు నన్నఁ బోలీసు వారు తపస్సు చేయవలసినదే!

వసంతము కడచని గ్రీష్మము తలచూపెను. అపుడు పారిస్‌లో నెటు చూచినను విప్లవబీజములు మొలక లెత్తెను. ఆ కాలమున దేనికిని నిలుకడ యనుమాట లేదు. ప్రజలను రాజనిన కంటక మాయెను. వారు రాజును దీసి వయిచి ప్రజాప్రభుత్వమును స్థాపింపఁ బూనుకొనిరి.

మార్యొసు, అతని మిత్రులు మఱికొందఱును దీనిలోఁ బ్రముఖులు. ఆవేశము కలిగించు నేవిషయమయినను సరే, దానికి గావ్రోషు సుముఖుఁ డని మనకుఁ దెలియును. అతఁ డిపుడు చాల మిత్రులను విసర్జించెను. ఏలనఁగా నిపుడు వారి వెంటనుండుట కతనికి వీలులేదు. వారికి గావ్రోషుకువలె పారిస్ అంతయు త్రొక్కిన చోటుకాదు. కావున 1832

సాలున 5 జూన్ తేదిని గాబ్రోషు పాక్కుఁడే వేలని పాఁత పిస్తోలొకటి చేతఁ బట్టుకొని తుపాకి మ్రోఁగుచున్న యొక వీధిదెసఁ బరువెత్తుచుండెను. నడుమ నొక సామంతుని మేడ కనఁబడఁగా నతఁడు దాని కిటికీకడ నాఁగి—"నాతో రండు, మీ దేశముకొఱకు యుద్ధము చేయుఁడు" అనెను.

అపుడు తుపాకులు చేబూని కొంతమంది ఒక దిక్కుగాఁ బోవుచుండుట కనుఁగొని యతఁడు వారిలోఁ గలిసెను. అపు డెనుబదియేండ్లవాఁ డొకఁడుగూడ వానికిఁ దోడాయెను. "ఇతని ముంగలనే నేను డబ్బుసంచి పడవయి చితి" నని గాబ్రోషనుకొనెను. ఆ జనసమూహములో నొకఁడు మాబోను జూచి "అయ్యా! మీ రింటి కేఁగుట మే" లనెను.

"నేనేల పోవలెను?"

"అచట పెద్ద గందరగోళము జరుగును."

"మంచిది."

"వట్టి గందరగోళము కాదు. యుద్ధము! తుపాకులు! ఫిరంగులు!"

"మంచిది. మీ రెందాఁక? ఏమిచేయుటకు?"

"సర్కారును కూలఁద్రోయుటకు."

"మంచిది" అని యాముసలివాఁడు వారిని వెంబడింపఁదొడఁగెను. గాబ్రోషు అందఱు ముందఱ కరిగి లొల్లాయపద మొకఁ డందుకొనెను. ప్రక్కవీధులనుండి పలువురు వచ్చి వారిలోఁ గలియుచుండిరి. వా రొక సత్రము కడ కరుగుసరి కందఱుఁ గలిసి యేఁబదిమం దయిరి. వారి

నాయకుఁడు ఎన్ జోల్రాస్. అతఁడు పొడుగును, బలమును గలిగి చెట్టునఁ బుడికినటు లుండెను. అతఁ డా సత్తరువుకడ 'ఆఁగుఁడు' అనెను. సత్తరువులోనుండి యతని మిత్రుఁ డొకఁడువచ్చి—"ఇచట నెందుకు?" అని అనెను. "ఇచట నొక కాట్రగడ కట్టవలయును."

"ఇచటనా?"

"అగును. ఈ స్థల మనుకూలము."

ఈ ప్రదేశ మేల మేలయినదో కొంచెము తెలిసికొనవలెను. ఈ సత్ర మొక యిఱుకుసందు చివర నున్నది. అది పైకి గ్రుడ్డిసందువలెఁ గానఁబడును. కాని ఆ రస్తా నానుకొని మఱియొక రస్తా కడుదూరముగాఁ బోవును. అదియు సూటిగాలేక మెలికలు తిరిగిన యిఱుకురోడ్డు. ఎన్ జోల్రాసును, అతని మిత్రులును సత్రమున్న రస్తా కడ్డముగా కాట్రగడ కట్ట మొదలిడిరి.

శత్రువులు మీఁదికిఁ బరువెత్తుకొని వచ్చునపుడు వారి కడ్డు కలుగఁజేయుట కడ్డమయిన వస్తువుల నన్నిటిని దారిలో నడుమనడుమ గుట్టలు పోయుదురు. దానిని 'కంచెకోట' యనియు, 'కాట్రగడ' యనియు నందురు.

ప్రకృతము విప్లవకారు లందులకుఁగాను రస్తామీఁది రాలను, కల్లంగడిలోని ఉత్తపీపాలను, గూండ్ల యినుపచువ్వలను, ఇనుపముండ్ల కంచెలను దారి కడ్డముగా గుట్టపోసిరి. అపు డాదారి నొక సున్నపుబండి వచ్చెను. అదియు నందుల కుపయుక్త మాయెను. అపుడు దూరముగా నొక గుడ్డపు బండి పోవుచుండెను. వారు దానికడకుఁ బరువిడి అందలి

ఆఁడువారి నతివినయముగా బతిమాలుకొని దింపిరి. అంతట నా బండిని ఆ గుట్టకడకుఁ దోలించిరి. గుఱ్ఱములను విడిచిరి. వెనుకటి బండితోపాటి బండినిగూడ బోల్తా కొట్టించిరి. దాని ప్రోలు నిటారుగా నిలువఁబెట్టి దాని కొక యెఱ్ఱజెండా కట్టిరి.

ఆ సత్తరు వొక మేడ. దాని క్రిందిభాగమున విశాలమగు నొక గది కలదు. దాని గవాక్షము లన్నియు జరుగనున్న యుద్ధమునకు మూయుటవలన నా గది యంతయు చీఁకటికొట్టుగా మాఱెను. ఆ గదిలో నాజానుబాహుఁడొకఁ డొక తుపాకితో నిలునఁబడియుండెను. అతఁ డీ జన ప్రవాహములోఁ గలిసిపోయి యిచటికి వచ్చెను. అతఁ డీ ప్రదేశము నంతయుఁ బరిశీలించుచున్నటులు కనిపించుచుండెను. కాని తానుగూడ మఱియొకని పరిశీలనమున నుండెనని యతఁ డెఱుఁగఁడు. గాబ్రోషు చీఁకటిగదిలో నొక చీఁకటి మూల నిలుచుండి యాశ్చర్య చిహ్నముల నన్నింటిని జూపుచుండెను. అతఁడు తుద కొక నిశ్చయమునకు వచ్చి తలుపు కడకుఁ బరువెత్తెను. అపు డెక్ జోల్‌రాసు తలుపుతోసి వాని కెదురాయెను.

"ఓరి బాబూ! నీకోసమే తిరుగుచున్నాను. నీవు తుపాకిగుండువలె పరుగెత్తి సైనికు లెవరేని యీ దెస వచ్చుచున్నచో గాలివలె వచ్చి మాకుఁ దెలుపవలెను."

"ఒక్కనిమిష మాఁగుఁడు" అని గాబ్రోషు చూపులతో తనవెనుక నున్నవాని దెస సైగచేసెను.

"ఏమి? నీ వతని నెఱుఁగుదువా?"

"వాఁడు వేగులవాఁడు."

అపుడు ఎన్‌జోల్‌రాసు కనుసైగచే నలుగురువచ్చి ఆ పొడుగుపాటివాని వెనుక నిలువఁబడిరి.

అపు డెన్‌జోల్రా సతనిఁగని—"నీ వెవఁడవు?" అని యడిగెను. అతఁడు తన పని యిఁక నయినదని తెలిసికొని "ఆఁహాఁ! మీరు తెలిసికొంటి" రనెను. అంతట నొకఁడు వాని జేబులు వెతికి యొకచీటి తీసెను. అందిట్లుకలదు :

"ఇన్‌స్పెక్టర్ జేవర్‌కు—కంచెకోటకడ నీ పని చూచికొనిన తరువాత సీన్‌నది యొడ్డుమగట్టున నే పోయి మార్కెట్టు దాపున దోషు లెవరేని దాఁగిరేమో యారయునది."

అందఱు నీయుత్తరము చదివికొనిరి. పిమ్మట నా గది నడుమనున్న యొక కంబమునకు వాని నంటఁగట్టిరి.

"వానిచేతిలోని తుపాకి నాకిం"డని గావ్రోష నెను.

"నీవు తిరిగి రాఁగనే" అని ఎన్‌జోల్‌రాసనుటయు, గావ్రోషు కానరాకుండఁ బోవుటయు జరిగెను.

"నన్నేల కాల్చరు?" అని జేవ రడిగెను.

"ఇపుడు మందు వమ్ము చేయఁజాలను. నీ వంతు వచ్చును లెమ్ము" అని ఎన్‌జోల్‌రా సనెను.

అపుడు కాకియఱపుతో ముగిసిన యొకపాట పాడుచు వచ్చు గావ్రోషు దవ్వులఁ గాననాయెను.

"అది మనకు హెచ్చరిక" అని ఎన్‌జోల్‌రా సనెను. అంతట నతఁ డందఱును జూచి "మీరెల్లరును మీమీ స్థలములలో నిలువుఁడు" అని యాదేశించెను. మఱునిమిషములో గావ్రోషు రోఁజుకొనుచువచ్చి పిల్లివలెఁ గంచెకోట

యెక్కి "నా తుపాకి నా కిందు. వారదె వచ్చుచున్నా" రనెను.

అపుడు విప్లవకారులలోఁ గొందఱు ఆ కాట్రగడ వెనుకను, గొంద ఱా సత్రపు మేడమీఁదను దమ తమ స్థలముల నేర్పఱచుకొని కాట్రగడ సందులనుండియు, మేడ గవాక్షముల నుండియు గుఱిపెట్టుకొని యుండిరి. అంతట నా వీథిచివరఁ గొన్ని మనుష్యాకారములును, వానిముందొక వెలుఁగును, ఆయుధములును గానుపించెను. తరువాత "ఎవరచట?" అను నొక పేరెలుఁగు వినఁబడెను.

"పరాసు విప్లవము" అని ఎన్‌జోల్‌రాసు సమాధానము చెప్పెను.

"ప్రేల్చుఁడు" అని సేనానాయకుఁడు గర్జించెను.

ఒక పెద్ద ధ్వనివెంట నొక మెఱుపు మెఱసెను. గుండుదెబ్బల కిరువురు మూవురు మడసిరి. బండిప్రోలు చివరనుండి గుండు దూసికొని పోయెను. దానికిఁ గట్టిన యెఱ్ఱబావుటా కూలెను.

ఎన్‌జోల్‌రాస్ తనవారి కిటు లనెను: "మీరు తుపాకులు ప్రేల్చకుఁడు, వృథాచేయుటకు మనకు మందు లేదు." రాజసైనికు లపు డొక క్రొత్త యెత్తెత్తిరి. ఎన్‌జోల్రాసు సత్రమునుండి బయటికి వచ్చుచుండఁగా గాబ్రో యెదురుపడి—"వారు కంచెకోటను ముట్టడించి" రని చెప్పెను. మినుకు మినుకు మను నా కాంతిలో సైనికుల శిరస్త్రాణములు కనుపట్టెను. వారు తుపాకులు బారుచేసిరి. సత్రములోనివా రందఱును వెలికి వచ్చిరి. అపుడు సంకుల సమరము జరిగెను. మార్క్విసొక మందు పీపాను కాట్రగడ

మీఁదికిఁ ద్రోసి యొక దివటీ పట్టుకొని "మీరందఱు పాఱి పొండు; అటులు పోరేని దీని నంతయు నెగురఁగొట్టి వైచెదను" అని బిట్టఱచెను.

అంత సైనికుల యురవడి కొంత యాఁగెను. తన మృతినిగూడ లెక్కపెట్టని యా మార్క్విసు నిశ్చయమును జూచి సైనికు లందఱును వైదొలఁగిరి. ఒక చిటికలో నా వీథి యంతయు సేనాశూన్య మాయెను.

అపుడు మార్క్విసు గాబ్రోషును జీటి—"ఈ నా యుత్తర మొకటి నీవు తీసికొని పోవలయును" అని యనెను. గాబ్రోషు ముందు కొంచెము తచ్చాడెను గాని కొంచెము సేపటిలోనే తన యాజ్ఞాదాత కియ్యకోలు చూపెను. మార్క్విసు చీటి యిచ్చి—"ఇది శ్రీమతి కోజెత్ ఫోశెల్వాన్ కు. ఆర్మ్ వీథి. 17 వ యిల్లు. నీ విపుడు దీనినిఁ గొంపోయి తపాకడ నామె కిమ్ము" అని చెప్పెను. "అంతవఱకు నే నిట నుండవలదా?" "వలదు. అప్పటికి మనల ముట్టడింతురు. నీ విటనుండి యావలికిఁ గాలుపెట్టఁ జాలవు."

అంతట గాబ్రోషా చీటి గైకొని "ఇపు డించుమించు నడిరేయి. నేను దీని నిపుడే బట్వాడా చేసి వెంటనే వెను దిరిగి సమయమున కందుకొనవలెను" అని దారి పొడుగున తలఁచుచుఁ బరుగిడి పరుగిడి యా వీథి పట్టుకొనెను. ఇంటిమీఁది సంఖ్య చూచుట కంధకారము. అట్టి యంధ తమసమున నొక మేడముందు బల్లమీఁదఁ జేతులలోఁ దల పాఁతుకొని వీరాసనమునఁ గూరుచుండిన పురుషుఁ డొకఁ డతనికిఁ గానవచ్చెను. గాబ్రోషు గబగబ యచటి కేఁగి

"ఓ వృద్ధబంధూ! 17-వ సంఖ్య గల యిల్లేదో కొంచెము చెప్పఁగలవా?" అని యడిగెను.

"ఇదియే. ఇచట నెవరితో నీకుఁ బని?"

"శ్రీమతి కోజెత్ ఫోశెల్వాన్‌తో. ఆమె కొక చీటి తెచ్చితిని."

"నా కిమ్ము. ఆమె నిదిరించుచున్నది. ఆమె లేవఁగనే యిచ్చెదను."

గావ్రోషుకుఁ గొంచె మనుమాన ముదయించెను గాని కంచెకోటమీఁదనే వాని ప్రాణములు కావున నా కమ్మను వాని కిచ్చి తుఱ్ఱుమనెను. జీన్ వాల్‌జీన్ తలుపు తెఱచికొని లోనికేఁగి కాకితము విప్పెను. అతఁడు మొదటి రెండు వాక్యములుమాత్రమే చదివెను: "నాకు మరణము కొలఁదిసేపటిలోనే యున్నది. నీ విది చదివికొనుతలికె నాయాత్మ నీకు దాపగును......"

ఈ యుత్తర మెవరికడనుండి వచ్చెనో వాల్‌జీన్‌కు చక్కఁగాఁ దెలియును. ఏలనఁగా మార్యూసు, కోజెత్తు లుద్యానమునఁ బలుమాఱులు చూచుకొనిరి. ఎపుడో కోజెత్తు తన యునికిని మార్యూసుకుఁ జెప్పియుండును. వెంటనే కోజెత్తు కొక చీటి వ్రాసి, మార్యూసు చీటిదాఁచి పలుపు మీఁదఁబెట్టి యతఁడు గావ్రోషు పోయిన దారినే పోయెను.

మార్యూసు వాల్‌జీన్‌ను జూచి డిల్లపడెను. వాల్ జీన్ మార్యూసు నెఱిఁగియున్నటులు చూపట్ట లేదు. కావున నతని కతనితో మాటలాడుటకు ధైర్యము చాలలేదు.

ప్రభాతమగునంతకుఁ దమపని యైన దని విప్లవకారు

తెఱఁగికొనిరి. ఏల యనఁగా పట్టనమునం దెల్లెడలను విప్లవము పాడుకొనలేదు. ఈ రెండు కంచెకోటలును ఎంతయో సేపు నిలువఁజాలవు. ఎంతయో సేపు కాచుకొని యుండవలసిన యాయాస మక్కఱలేకయే ఫిరంగిని లాగికొనివచ్చు రాజసైన్య మాసందుమొగలోఁ గనఁబడెను. మొదటిగుండు విఫల మయినను రెండవది యిరువురను జంపి, మూవురకు గాయములు గలిగించెను.

"దీనికిఁ బ్రతిక్రియ చేయ కూరకుండరాదు. ఒక తీఁగల పఱుపు కావలెను" అని ఎన్‌జోల్‌రాస్ కూయిడెను.

పొరుగింటి కిటికీ కడ్డముగా నొక తీఁగలపఱుపు వ్రేలాడుచుండెను. ఆయింటి ముసలిది రక్షణమునకుఁగా నా తీఁగల పఱుపును కిటికీకి రెండు వైపుల రెండు త్రాళ్ళతోఁ గట్టుకొనెను. వాల్‌జీన్ తుపాకి గుఱిపెట్టెను. ఒక త్రాడూడెను. రెండవసారి గుఱికి రెండవత్రాడూడెను. పఱుపు క్రిందఁబడెను. సైనికులు కురియు గుండ్లవాన తప్పించుకొనుచు వాల్‌జీన్ ఆపఱుపుదెచ్చి దానిఁ గట్టవలసినచోటున సరిగాఁ గట్టెను. మరల ఫిరంగి ప్రేలెను. గుండందు దూఱి యాఁగిపోయెను. విప్లవకారు లందఱును వాల్‌జీన్ మీఁద ధన్యవాదములను, శత్రువులమీఁదఁ దుపాకి గుండ్లను గురియించిరి. అపుడు రాజసైనికులు పలువురు నేలఁగూలిరి.

అపుడు మిత్రుఁ డొకఁడు "మనపని బాగున్న"దని ఎన్‌జోల్రాసుతో ననెను. "ఇంకొక పావుగంట బాగుండును. పిదప మఱి మం దుండదు" అని యతఁ డనెను. ఈ మాట గావ్రోషు చెవినిఁబడెను. మఱునిమిషముననే యొక చిన్న

యీకారము కాట్రగడముందు మందుపొగలో నప్పసము వంగి పరుగెత్తుట కాననాయెను. అతఁడు గాబ్రోషు. వాని చంక నొక సంచి. క్రిందఁబడిన సైనికుల తోలుసంచులనుండి యతఁడు గుండ్లు నేఱి సంచిలో వేసికొనుచుండెను. మునిముందతనిని పొగ మాఁటుపఱచెను గాని ముందరి కేఁగినకొలఁది నతఁడు వీథిచివర నున్న సైనికుల కంటఁ బడవలసివచ్చెను.

అపుడొక కూలిన సైనికుని తోలుసంచినుండి గాబ్రోషు గుండ్లొడుచుకొనుచుండెను. ఒకగుండు వచ్చి వాని సంచికిఁ దగిలెను. గాబ్రోషా గుండును దీసి ప్రేలినగుండ్ల గుంపులోఁ బడవయిచెను. అంతట నతఁ డుచ్చైస్స్వరమున నొక పాటపాడుచు మఱియొక తోలుతిత్తి నుత్తది చేయఁ దొడఁగెను. అపుడా కుఱ్ఱని చుట్టుప్రక్కల గుండుమీఁద గుండు, గుండుమీఁద గుండు పడఁదొడఁగెను. అతని హాస్య చేష్టల కా సైనికులు నవ్వాఁపుకొనలేకపోయిరి. తుద కొకగుండు వానితలకుఁ దగిలెను. దాన నతఁడు కూర్చుండఁ బడెను. అతని మొగము నెత్తురుకొల్లయినను నతఁడు మఱియొక చరణ మందుకొనెను. అది పూర్తికాకమునుపే మఱియొక గుండువచ్చి తగిలి యతనిని నేలమీఁదఁ బరుండఁ బెట్టెను. అతఁడు మఱి కదలలేదు. ఆ పిన్నవానిలోని పెద్ద యాత్మ యెగిరిపోయెను. అపుడు మారియసును, మఱియొకఁడును గలిసి పరువిడి యీ దేహము నా సంచితోఁ గొనివచ్చి సత్రములో నుంచిరి.

"విప్లవకారులకడ నున్న మందంతయుఁ గొలఁదిసేప టిలోనే ఐపోయెను. ఇఁక నెంతయో సేపీ కాట్రగడ నిలువ

దని వారనుకొనిరి. అపు డెన్‌జోల్రాసు వాల్‌జీన్‌ను జూచి—"పౌరుఁడా! నీవు మాకుఁ జాల నుపకారము చేసితివి. నీ కేమేని కోరిక యున్నదా?" అని యడిగెను.

"ఉన్నది. ఈ వేగువానిని శిక్షించు నధికారము నా కీయఁ గోరెదను."

ఎన్‌జోల్రాసు వింతపడి "మంచి" దని యనెను. అపుడు వాల్‌జీన్ లోని కేఁగి కట్టుత్రాడు విప్పెను. జేవరు కాలుసేతులకును త్రాళ్ళసంకెల లుండెను. అతఁడు వాని నా సంకెలలతోడనే మెలమెలగా నడపించి తీసికొని పోవు చుండెను. జేవరు వాల్‌జీన్‌ను వెంటనే పోల్చి—"ఇపుడు నీవంతు వచ్చినది. మంచిది. ఇది న్యాయ్యమే" అని యనెను.

వాల్‌జీన్ ఏమియుఁ బలుకక తనను వెంబడింపు మని సన్నసేసి చిన్నకంచెకోటకడనున్న యొక సందులోనికిఁ బోయి, యచట నొక చాటుమూల నతని నిలిపి, యొరలో నుండి యొక పెద్దకత్తిని వెలికిలాగెను. "కత్తియా యది? నీవు చేయవలయు పని కదియ కావలయు" నని జేవ రనెను.

వాల్‌జీన్ మాటాడక జేవరు కాలిసేతుల సంకెల లను కోసివయిచి "ఇఁక నీవు పోవచ్చును" అని యనెను.

జేవ రొకనిమిషమాత్రము తెల్లఁబోయి అంతట వెళ్లిపోయెను. ఇంతలోఁ బెద్దకొత్రటగడమీఁద నొత్తిడి యెక్కుడాయెను. మందయిపోవుటచే విప్లవకారు లిఁక దాని నాఁపలేక యొక రొకరే సత్రములోనికి దారితీయఁ జొచ్చిరి.

ఎన్‌జోల్రాసును, మార్యొసును మిగిలిరి. ముందు ఎన్ జోల్రాసు లోని కేఁగుచుండెను. అతనికిని, గంచెకోటకును

నడుమ నున్న మార్వ్విసుమీఁద నొకగుండు వచ్చి పడెను. మార్వ్విసు తన వెనువెనుకనే వచ్చెననుకొని ఎన్‌జోల్రాసు తలుపు మూసెను. మార్వ్విసా దెబ్బ కదిరి తూలి యింటి గోడ మీఁదఁ బడెను. చైతన్యము లోపింపఁ బోవుచుండఁ దొకఁడు తనను బట్టుకొనెనని మార్వ్విసు గ్రహించి 'నేను బందీనయితిని. నా కిఁకఁ దుపాకి వ్రాఁత వ్రాసియున్న' దనుకొనెను.

అనతికాలములోనే కొందఱు సైనికులా సత్రరువు తలుపులను బలాత్కారముగాఁ ద్రోసివయిచిరి. ఆ సైనికులకు సత్రములోపల శవములు తక్క మఱి యెవరును గానరాలేదు. వారి నెదురుకొనిన విప్లవకారుల నందఱను సైనికులు జంపివయిచిరి. తుదకు ఎన్‌జోల్రాసు సైనికుల కెదురుగా నిలిచెను. అతనిని జంప నెవరికిని బుద్ధి పుట్టలేదు. అతఁడు వారికి లొంగ నంగీకరింపలేదు. అపుడు సేనాపతి వానినిఁ గాల్ప నాజ్ఞయిచ్చెను.

మార్వ్విసొకనికిఁ బట్టుపడిన మాట నిక్కము కాని యా పట్టుకొన్నవాఁడు జీన్‌వాల్‌జీన్. అతఁడు వెనుకటి చాటుమూలకు వానిఁ గొంపోయెను. సైనికులందఱు నా సత్రరువులో తత్తఱబిత్తఱ లాడుచుండిరి. కాని వారిలో నెవఁడేని వెలుపట నేమి జరుగుచున్నదో యని చూడవచ్చెనో యిఁక వారిపని హైనదే! కావున వాల్‌జీన్ అచటి నుండి తప్పించుకొనిపోవుటకు మార్గ మాలోచించెను. సరియగు మార్గ మేదియు లేదు. ఈ రెండు వీథులవెంట వెళ్లుటకు యమద్వారములు కదా! వాల్‌జీన్ నలుదెసలఁ గలయఁ గాంచెను. చిన్న కాట్రగడదాపున నేలవాలుగా నొక

యినుపచువ్వల తలు పతని కంటఁబడెను. దానిచుట్టును దాప టము చేయఁబడిన జాతిపలకల నూడఁబెఱికి విప్లవకారులు కాట్రగడ కుపయోగించుటచే నా చువ్వల తలుపు లూకలుక లాడుచుండెను. దాని చదరము రెండడుగులు.

ఎల్లపుడును వేగులచే వెంటాడఁబడుచుండువాఁడందఱు నుపేక్షించు పలువిషయములను గుఱుతులో నుంచుకొనును. అది నగరమునుండి సీన్‌నదిలోనికిఁ బ్రవహించు మురికి కాలువ యని యతఁడు గ్రహించెను. దాఁటుకొనిపోవుట కది యొక యుపాయము కావచ్చును. అతఁడు వెంటనే యా యినుపచువ్వల తలుపును లాగి మార్యసును భుజములమీఁద వేసికొని మడమలు, కాళులు, చేతులు, వీని యాధారమున నా తలుపు నినుపకామ్ నవలంబించి తొమ్మిదడుగుల లోతు నకు దిగెను. అతఁ డా కామను ఈవలికి లాగెను. తలు పెప్పటి చోటునఁ బడెను.

మన రాచబాటలమీఁద నిటువంటి యినుపచువ్వల తలుపుల నందఱును జూచియే యుందురు. పారిస్‌వంటి మహా నగరము లన్నింటిక్రిందను భూగర్భమునఁ జాల జలదారు లుండును. ఇంటింటఁబడు నీరును, వాననీరును, ఉచ్ఛిష్టమును, బరిశిష్టమును నా జలదారులగుండ రేయుంబవలును బ్రవ హించుచునే యుండును. చిన్నదారులన్నియుఁ బెద్దజలదారు లలోను, అవన్నియుఁ గలిసి వేఱొక పెద్ద జలదారిలోను బడును. తుదకా పెద్ద జలదారి యొక నదివలె మఱియొక నదిలో సంగమించుచుండును.

ఆ జలదారిలో వాల్‌జీన్ నిలిచి నడవవచ్చును.

కాని యతని మూంపున మార్ట్విసు. అతని కింకను జేతన కలుగ లేదు. వాల్ జీన్ తన యొకచేత మార్ట్విసురెండుచేతులను బట్టుకొని మఱొక చేత గోడ తడుముకొనుచు నడవం దొడం గెను. మార్ట్విసునుండి రక్తబిందువులు జాఱి వాల్ జీన్ మీందం బడుచుండెను. అతని శ్వాసప్రశ్వాసములు గండ ఫలకములకుం దగులుచుండెను. కావున నతండు బ్రతికి యుండెనని వాల్ జీన్ ఎఱింగెను. అతం డీ ప్రకారము పోవు చుండంగాం బలుతావుల మలుపుదారు లడ్డుపడం జొచ్చెను. ఎల్లెడల నతండు పల్లముగానున్న జలదారినే యనుసరింపం దొడంగెను. ఇటులు పోవంబోవ నతనికి నెత్తిమీంద నుఱిమి నటులు చప్పుడు వినంబడెను. అది శకటధ్వని. అది విప్లవము లేని యొకానొక నగరప్రదేశము.

అచట నతని కతని నీడ హఠాత్తుగాం గానిపించెను. అతండు సరిగా చూచెను. ఒక యెఱ్ఱని చుక్క భయంకర ముగాం దన కేసి చూచుచున్నటు లతనికిం గానిపించెను. దాని వెనుకం బదిపండ్రెండు నలుపునీడలు పోవుచున్నటు లస్పష్టముగాం గనవచ్చెను. విప్లవవాదు లెవరేని కాలువ లలోంబడి తప్పించుకొని పోవుచుండిరేమో యని పోలీసులు వెతకుచుండిరి. అవి వారి నీడలు. వా రతని యడుగుల చప్పుడు విని నలుదెసలు చూచుచుండిరి.

వాల్ జీన్ వారిదీపమును లెస్సగాం జూడంగలిగినను వా రతనినిం జూడంజాలకపోవు టదృష్టమే యని చెప్ప వచ్చును. ఏలనంగా నతం డపుడు చిమ్మచీంకటిలో నుండెను. అతండు వారినింజూడ నాంగినపుడు వారికిం బదధ్వని వినంబడ

లేదు. వా రపుడు రెండువీథుల కూడలిలోఁ గూరుచుండి తలలు తాటించి గుడగుడ లాడుకొనిరి. తమది పొరపాటని వారు తేల్చుకొనిరి. 'ఇఁక వెనుదిరిగిపోవుట మేలుతర' మని వా రనుకొనిరి. అయినను వారి నాయకుఁడు తన తృప్తికొఱకు ఆ జలదారిలో పిస్తోలు పేల్చెను. గుండు పోయి వాల్ జీన్ తలమీఁది కప్పునకుఁ దగిలెను. ఒక పెద్ద బెత్తిక యూడి యతని ముందరి నీరిలోపడి ఛటాత్కారము చేసెను. అంతట నా దీపము ముందులకు సాగెను. నలుపు నీడలు దాని ననుగమించెను. అవి యన్నియుఁ బూర్తిగాఁ బోవునంతవఱకును వాల్ జీన్ ఆ జలదారిగోడకు బల్లివలె నంటుకొని పోయెను. ఇది యిటులుండఁగా నిర్జనమగు సీను నదీతీరమున నొకతంతు జరుగుచుండెను. ఒకఁడు ముందును, మఱియొకఁడు వెనుకను నడచిపోవుచుండిరి. వారి నిరువురను మన మెఱుఁగుదుము. ఒకఁడు తెనార్డిర్; రెండవవాఁడు జేవర్.

ఏటవాలుగానున్న నదీతీరము పొడుగునను నొక బాటకలదు. అక్కడనుండి చూచుచో నెత్తుగా నొక రోడ్డు కనఁబడును. దాని వెంట నొక బండి పోవుచుండఁగాఁ జూచి జేవ రా బండివానికిఁ దన్ననుసరించి యారోడ్డువెంటనే వచ్చుచుండు మని సైగచేసెను. అతఁడు వానిసైగ ననుసరించి బండి నడుపుచుండెను. ఈ ప్రదేశమున నదీతీరము సన్నము. అటుపైని ఒడ్డుమీఁదినుండి నీరు దుముకుచుండుటఁ జేసి నడచిపోవుటకు వీలులేదు.

తెనార్డిర్ ఈ ప్రదేశమునకుఁ జేరి రోడ్డుదెసకుఁ బోక సన్నగానున్న నదీతీరమునే యనుగమించెను. కొలఁది

నిమిషములలో నతఁడు జేవరుకుఁ గనఁబడకుండ నంతర్ధాన మాయెను. ఏలనఁగా నొడ్డునుండి నదిలోని కొక రాలగుట్ట గోడవలె వ్యాపించియున్నది. ఆ రాలగుట్ట యిపుడు వారిరువురకును నడుమ. కావున దాని నడ్డముచేసికొని జేవరు కొన్ని నిమిషములలోనే యుటికి రాలగుట్టఁ జేరుకొనెను. అచట ముక్కోణముగానున్న యనూప ప్రదేశమునఁగాని, నదీతీర కుడ్యమునఁగాని యెట్టెదుటనున్న నదిలోఁగాని మనుష్యుని జాడయే లేదు. జేవరు నదినిఁ జూచెను. లేఁడు. నదిలో దుమికిన చప్పుడుగాని, యీఁదిన చప్పుడుగాని లేదు. అతఁడు గోడదెసఁ జూచెను. దాని నెక్కుటసంభవము.

అతని చూపొక యినుపచువ్వల తలుపుమీఁదఁబడెను. నగరమునుండి వచ్చు మురికికాలువ అచటనే సీనునదిలోఁ గలియును. దానితూము చాలఁ బెద్దది. దానికి లావైన యినుపకమ్ములతోఁ జేసిన తలుపును, దానికొక పెద్దతాళమును గలవు. తుప్పినుమును లెస్సగాఁ దినుచుండెను. దాని నిపుడే యెవరో తెఱచియుందురు. ఏలనఁగా దాని నెవరేని యటిటు లాగినను గొట్టినను జెవిటికఁగూడ వినఁబడితీరును. కావున నది కంటఁబడఁగనే జేవరు—"వానికడ సర్కారు బీగ ముండవలెను" అని తనలో ననుకొని యచటఁ బీట వెట్టికూరుచుండెను. బందీవాఁడు రోడ్డుమీఁద వేచియుండెను.

జీన్ వాల్ జీన్ విసువుగొలుపు నా దారిలో వేళ్లు గ్రుచ్చుచుఁ బండ్లబిగువునఁ బోవుచుండెను గాని యలపు, నాఁకలియు నాతని వేధింపఁ దొడఁగెను. మఱియు నీ జల దారులలో నొక దారియు, డొంకయు నున్నదా? ఎంతసే

పైనను ఈపద్మవ్యూహములోఁ దిరుగుచుండుటయే గతియని యతని కధైర్యము తోఁచెను. కాని చచ్చియే పోయెనో, బ్రతికియే యుండెనో తెలియకున్నను మార్విసును మాత్ర మచటఁ బాఱవయిచిపోవు నుద్దేశ మతనికిఁ గలుగలేదు. నడుమ మార్విసును దింపి, యతఁడు సేద దీర్చుకొనును. మరల లేచి నడవఁ గలుగుట యసంభవమని యతనికిఁ దోఁచును. ఇటులు ఆ జలదారిలో నడు గామడగాఁ బోవు చుండఁగా నాతని కొకచోట నొకానొక పెద్ద తలుపువద్ద వెలుఁగు కనఁబడెను. అచట నతఁడు మార్విసు జేబును దడిమి చూచెను. అందొక చీటి చేతికిఁ దవిలెను. దానిలో తన చిర్నామా, తాను చనిపోయినచోఁ జూచినవా రెవరేని దయయుంచి తన తాతగారి యింటికిఁ దనను దీసికొని పొమ్మని వేఁడికో లుం దుండెను. వాల్జీన్ దానిని బలుమాఱులు చదివికొని యా చిర్నామాను కంఠపాఠ మొనరించెను. మఱియుఁ దన చొక్కా చించి చాలఁ బేలికలుచేసి మార్విసు గాయము లన్నింటికిఁ గట్లు కట్టెను.

చిమ్మచీఁకటులు కమ్ముకొనిన యొకచోట నతని కిపు డొక క్రొత్త గండము సంభవించెను. అతని యింతదవ్వు నడకలో జలదారి యెల్లెడలను నెంత జాఱుడుగా నున్నను అడుగుల క్రింద మాత్రము గట్టిగనే యుండెను. ఇపు డతని యడుగులు దించుకొనిపోవుచుండెను. మొదటఁ జీలమండలు మునుఁగు వఱకును బురదయుఁ, బిక్కలు మునుఁగు వఱకును నీరును ఆవరించెను. పిదప నతఁ డడుగాన్చిన కొలఁదియు బురద పిక్కలవఱకును, నీరు ముక్కువఱకును వచ్చెను.

వాన దెబ్బలకు గారయంతయుఁ జిటిలియూడి కొట్టుకొనిపోయి యచట దొంగయూబి యేర్పడెను. మారియసు బలు వొకటి లేనిచో నతఁడు దానినుండి బయటఁబడవచ్చును గాని వానిని వదలు టెటులు?

మఱు నిమిషములో నతని పాదమున కొక గట్టి పదార్థము తగిలెను. అతని ప్రాణములు లేచివచ్చెను. అది ఱాతి చదను. దాని యాధారమున నతఁడు ముంగలికూఁగి కదలినకొలఁది బురద తక్కువ తక్కువ కాఁదొడఁగెను. అతఁడెటులో ఆ దొంగయూబిని దాఁటెను.

అటుపిమ్మట నతనికిఁ జాలఁ దేలిక యాయెను. ముఱికికాలువ చివర తలుపులనుండి వెలుఁగును, గాలియు వచ్చుచుండెను. అతఁ డచట మారియసును దించి ద్వారముకడ కరిగెను. లావయిన యినుపకమ్ముల తలుపు. దానికిఁ జేటంత తాళము. అతఁడు బలముకొలఁది ఆ తలుపు లాగెను. అది రా దని యతఁడు తెలిసికొనెను. అతఁడు మరలి మారియసుకడకు వచ్చెను. అతని ధైర్య మిగిరిపోయెను. మరల వచ్చినచోటున కేఁగఁ గలుగుట సున్న. కావునఁ జేయునది లేక తల తాయిచేసికొని యతఁ డచటఁ గూలఁబడెను. అంతలో దాపున నొక యలికిడి విని తల యెత్తి చూచెను. మనుష్యుఁ డొకఁడు కనఁబడెను. అస్పష్టమైన వెలుఁగు వాని మోమునఁ బడుచుండెను. వాఁడు తెనార్డీర్. జీన్ వాల్ జీన్ వీఁపు తెనార్డీర్ కేసి యుండుటచే నతఁ డితనిని బోల్చుకొనలేదు. అంత తెనార్డీర్—
"ఓహో! నీ పని తెలిసెలే. చెఱిసగము వాటా పెట్టనిచో

నీకు సాయము చేయునది సున్న.''

''నీ మాట నాకర్థము కాలేదు.''

''నీవు బయటికి వచ్చి యా శవమును నదిలోఁ బాఱ వేయఁదలఁచియుంటివి కదూ? ఇదిగో చూడు!'' మని తెనార్డీర్ మంత్రగబ్బవంటి యొక బీగము పైకిఁ దీసెను. వాల్‌జీన్ కనులు చెదరెను. తెనార్డీర్ మరల—''నీ వెంత లూటిచేసితివి?'' అని అనఁగా వాల్‌జీన్ జేబు నుండి యొక లూయీని, మఱికొన్ని ఫ్రాంకులను పయికిఁ దీసెను. తెనార్డీర్ 'ఇంతకే యొకనినిఁ జంపుట పాడికా'దని యనుకొని తానే మారియసుజేబుల లోపలను, వాల్‌జీన్ జేబులలోపలను జేయి వెట్టి దేవెను. మఱి యేమియు లేక పోయెను. వాల్‌జీన్ తనముఖము తెనార్డీర్ గుర్తింప కుండుటకు రెండవ వైపునకుఁ ద్రిప్పెను. తెనార్డీర్ మారియస్ కోటు చించి యా ముక్కను తీసి దాఁచుకొనెను. అవసర మగుచో చంపఁబడిన వ్యక్తి ఆచూకి దీయుటకది ఉపయో గించునని యతని యూహ. అంతట నతఁడు తన వాటా మాట మఱచి, వాల్‌జీన్ చేతిలోని దంతయు నొడిచికొని, బీగము నిచ్చి తెనార్డీర్ మాయమైపోయెను. వాల్‌జీన్ మఱి యాలసింపక మారియసును బుజములమీఁదఁ బడవయిచి కొని, తలుపు తీసి వెలికివచ్చెను.

మలుసంజ తఱుముకొనివచ్చెను. వాల్‌జీన్ మారియ సును మెల్లగా నొడ్డున దించెను. నదిలోని నీరు దోసిటఁ దెచ్చి మారియసు మోమునఁ జిలుకఁ దొడఁగెను. అతని మోమునఁ జైతన్యచిహ్న మేమియుఁ గనఁబడమి మరల నీరు

తెచ్చుటకు నదిలోనికి వంగెను. అపు డొకవ్యక్తి యతని వెనుక నిలిచెను. అతఁడు వెనుదిరిగి చూచెను—జేవరు !

తన శ్రమ యంతయు వ్యర్థమైపోయిన దని యతఁడు భావించెను. అడుగడుగునను గండములను, తుట్టతుద కీ యూబిని దాఁటుకొనివచ్చిన సంతోష మంతయు నొక్క త్రుటిలో నిటులు సమాప్త మాయెను. నఖశిఖాపర్యంతము బురద కొట్టుకొని యుండుటచే నతనిని జేవరు గుర్తించలేదు.

"నీ వెవరవు?"

"ఎవఁడనయిన నేమి? తుదకు మీవాఁడను."

"మావాఁడవా? నీ పేరు ?"

"జీన్ వాల్‌జీన్."

జేవరు లెస్సగాఁజూచి గుఱుతించెను. అతని చూపు చాల భయంకరమాయెను. "నీ విట నే మొనరించు చుంటివి? అతఁ డెవఁడు?"

"మీ రితని కొక వరమీయవలయునని ప్రార్థింతును. నేను మీ చిక్కములోని పిట్టను. మీ రెచటికి రమ్మనిన నచటికి మాటాడకుండ రాఁగలను. కాని ముందితనిని ఇంట దిగఁబెట్టవలెను. ఇతని పేరును, చిరునామాయును ఈచీటియందున్న" వని వాల్‌జీన్ మారియసు జేబులోని చీటినిచ్చెను.

జేవరు మఱి మాటాడక బండివానికి సైగచేసెను. అతఁ డాబండిని పీర్లైనంతవఱకును క్రిందికిఁ దీసికొని వచ్చెను. వారిరువురుఁ గలిసి చేతనలేని యాశరీరము నా బండిలోఁ బెట్టిరి. వాల్‌జీన్ బండియెక్కఁగనే జేవ రెక్కెను. అంతట వాల్‌జీన్ జిల్‌నరమాను ఇంటివివరములు జెప్పి బండిని

దోలుమనెను. ఆ యిల్లిచటికిఁ జాల దవ్వు. బండి యింటికిఁ జేరుసరి కింటిల్లిపాది జనము నిదిరించుచుండెను. వారెట్టులో కావలివానిని లేపఁగలిగిరి. అపుడు వాల్‌జీనును, గావలి వాఁడును గలసి మార్యిసు నొక పడుకగదిలోనికి మోసికొని పోయిరి. వాల్‌జీన్ మరల బండియెక్కెను. జేవరుని జూచి "అయ్యా! మఱియొక మనవి. నేను కోజెత్తుతోఁ జెప్పి వత్తును. తమ దయ" అని యనెను.

దొంగల కనుగ్రహముచూపుట జేవరెఱిఁగినదికాదు. కాని యిపు డతని మదిలో నిదివఱ కెన్నఁడును లేని వింత లైన తలఁపులు ప్రసరించుచుండెను. అతఁ డపుడు బండివానికి ఆర్మీవీథి చెప్పి బండినిదోలుమని మరలఁ దనయూహలలోఁ దాను మునిఁగిపోయెను. వారు వడివడిగా వీథీముఖమునకు వచ్చిరి. ఆ వీథి యిఱుకు. బండి దానిగుండ పోవుట కష్టము. కావున జేవరు బండివానికి సెలవొసఁగెను. వాల్‌జీన్‌నును, జేవరును నడచి పదునేడవ సంఖ్యగల గృహముకడ కేఁగిరి. జేవ రతనిని వెంబడింపక గుమ్మముకడనే యాఁగిపోయెను. ఇదియు వాల్‌జీన్‌కుఁ బరమాశ్చర్యము కలిగించెను!

ఆ ముదుసలి మోఁకాళ్లమీఁదఁ జేతుల నానుకొని యొకొక్క మెట్టె యెక్కి యతికష్టముమీఁద మేడమీఁదికి దేహముఁ జేరవైచెను. 'ఇది కడసారి. బ్రదికినంతవఱకు నిఁక చెఱసాలబ్రతుకు. ఇంకొకతూరి తప్పించుకొనఁగల శక్తి మఱిలేదు' అని యతఁడు తలపోసికొనెనుగాని యతని ప్రధానచింత కోజెత్తు. "కోజెత్తు కేమి చెప్పుదును? దీని గతి ఏమగును? నేను దొంగనని తెలిసినచో మార్యిసుగాని,

మఱియొకఁడుగాని దీనిఁ బెండ్లాడునా?'' అని యతఁడు వగచుచు కిటికీనుండి గుమ్మము జూచెను. గుమ్మముకడఁగాని వీథిమీఁదఁగాని జేవరు లేఁడు!

జేవరు పుట్టి బుద్ధియెఱిఁగిన తరువాతఁ దా నెన్నఁడును జేయనిపని యొకటిచేసి కూర్చుండెను. అతని కాకస్మికముగా నొక యుద్రేకము కలిగెను. అతఁడు దానికి లోనాయెను. అతఁ డంతట వడివడిగా నడచి సీనునది సుడిగుండములతో నురవడించు చోటున నున్న వంతెనమీఁద నాఁగి యాలోచింపఁదొడఁగెను. అపుడు రాత్రి రెండు గంటలు. వంతెనమీఁద నెవరును లేరు.

మానవధర్మమునకును, భగవద్ధర్మమునకును భేదము కలదని యతని కిపుడే తెలిసెను. అతని జీవితమంతయు మానవకల్పితమయిన ధర్మమును సేవించుటలోనే కడఁచెను. తనపని తప్పని తన కేనాఁడును సందేహము కలుగలేదు. మఱి యిపుడో? తప్పించుకొనిపోయిన యొక దొంగను బుద్ధిపూర్వకముగా వదలివైచెను. ఈ దొంగ యింతకుముందే తన ప్రాణములను రక్షించినమాట నిక్కమే కాని, యది యొకటియే తన నీస్థితికిఁ దీసికొని రాలేదు. వేయివిధములుగా వికసించిన వాల్‌జీన్ గొప్పఁదనము 'ఈ ధర్మముల రెంటను ఏది యనుష్ఠేయము?' అను సంశయాగ్ని నతని మనఃకుటీరమునఁ బడవైచెను. దానిచేఁ గాలికాలి యతఁడు దాని జ్వాలను జల్లార్చుకొనలేకపోయెను. తన జీవితము నంతయు మార్పుచేసికొని యిఁకనుండియు దేవమానవుఁడను గాఁగల నను ధైర్య మతనికిఁ జాలకపోఁగాఁ దప్పించుకొని

తిరుగు నీ దొంగ నిపుడు జేతులార విడిచిన తరువాత నతని మనస్సాక్షి ప్రకృతోద్యోగమును నిర్వహించుట కెదురు తిరిగెను. దానంజేసి యతండావంతెన పిట్టగోడ నెక్కి గబాలున నదిలోనికి దుమికెను.

౯

మార్యొసు చాలంగాలమువఱకును జావుబ్రదుకులలో నుండెను. అతఁడు కొన్ని సప్తాహములవఱకును ననుసంధించి యున్న సంధిజ్వరములో 'కోజెత్, కోజెత్' అని పలవరించుచుండెను. ఈ రీతిగా నాలుగు నెలలు కడచెను. సంధి తగ్గిన పిదప మార్యొసు మఱి కోజెత్తు పేరెత్తలేదు. క్రమక్రమముగా నతం డారోగ్యము కోలుకొనుచుండెను.

వైద్యుని యుపదేశము చొప్పున మఱి రెండు నెలలకు మార్యొసు, కోజెత్తులకు వివాహము జరిగెను.

పెండ్లిబడలిక తీఱినపిదప మార్యొసొకనాఁడు జీన్ వాల్ జీన్‌ను జీఱి తన సౌధమునందే నివసింప వేడుకొనెను. కాని వాల్ జీన్ అందుల కంగీకరింపక తన కథనంతయు విశదీకరించెను. తుదకు కోజెత్తును మాత్రము దినదినము చూచిపోవుటకు అనుజ్ఞ యిమ్మని కోరెను. క్రమక్రమముగా నాయభ్యాసమును తగ్గించుకొందు నని కూడ చెప్పెను. అతఁడు క్రమక్రమముగాఁ దన రాకపోకలు తగ్గించెను గాని యెన్నిసారులా సౌధముకడ కరిగి వెలుపటి నుండియే తిరిగి వెళ్ళిపోవుచుండెనో దైవమునకే యెఱుక!

ఇక్కడ మార్యొసు మనసులో సుడిగుండములు గిఱ్ఱునఁ

దిరిగెను. 'వాల్‌జీన్ ఎవఁడు? ఇతఁడు పరుల కుపకరించుటకే బ్రతుకుచున్నాఁడు కాని తనగతియే చూచుకొనఁడే!' అని యతఁడు జాడ తీయుచుండెను.

అక్కడ వాల్‌జీన్ నిద్రాహారములు వదలెను. కోజెత్తు చిన్ననాఁడు ధరించు వలువలు మొదలగువాని నన్నిఁటిఁ బయికిఁదీసి శయ్యమీఁదఁ బఱచి వానిమీఁద మోముంచి రేయెల్లయు నుండెను. ఆమఱునటినాఁ డతఁ డా గదిని దాఁటలేదు.

ఒకనాఁడు మార్వ్విసు బండెఁడు కాకితములనడుమఁ గూర్చుండి వానిని తిరుగ వేయుచుండఁగా, తెనార్డీరు లోనికి వచ్చి నిలిచెను. అతని రూపమునను, వేషమునను జాల మార్పు కనఁబడెను.

"అయ్యా! ఏమిపని?" అని మార్వ్వి సడిగెను.

"దురదృష్టముచే నిచట నేను చివికి చివికి అమెరికాకు పోఁదలఁచితిని. లోకమంతయు స్వార్థపరము. నన్నెవరును జూడరు. అచట బంగారము కలదు. నేను దానిని బయి కెత్తుదును. మీరు నాకు ఇరువదివేల ఫ్రాంకులు..."

"ఓ! నా కేమి సంబంధము?"

"మీకుఁ జెప్పవలసిన రహస్య మొకటికలదు. తమ యింట నరహత్య చేయు నొక దొంగ మాఱుపేరున ప్రవేశించి యున్నాఁడు. వానిపేరు జీన్ వాల్‌జీన్."

"అతఁడు దొంగ కాఁడు."

"కాని ఇంకొక రహస్యము..." అని యతఁ డేదో చెప్పఁబోఁగా మాట కడ్డమువచ్చి మార్వ్విసు—"అయ్యా!

నేనును జాడలు తీయుచునే యుంటిని. జేవరును జంపుటఁ జేసి నరఘాతకుఁడు; మాదలేను ధన మపహరించుటఁ జేసి దొంగ. కావున మీ మాటయు నిక్కువము కావచ్చును'' అని యనెను. ''కాదు కాదు. ఏమాట కామాటయే చెప్పకొన వలయును. జేవరు నితఁడు చంపలేదు. జేవరే జేవరును జంపు కొనెను. మాదలేను ధన మితఁ డపహరించె ననుట కల్ల. మాదలేనే జీన్ వాల్ జీన్!'' అని తెనార్డిర్ చెప్పెను.

''ఆఁ! ఆఁ! దీనికి సాక్ష్యము?''

తెనార్డిర్ వెంటనే జేబులోనుండి కొన్ని కాకితములు తీసి యిచ్చెను. విప్లవములో నెవరో తనను జంపక కరు ణించి విడిచిన పిదప జేవ రాత్మహత్య కావించుకొనినటులు పోలీసువిచారణములోఁ దేలిన యంశ మొకటి, జీన్ వాల్ జీనే మాదలే నను నంశ మొకటి—ఈ రెండంశములును ఆయాకాలములలో నా యా పత్రికలలోఁ బడెను. ఆ పత్రికా ఖండములే యివి. మార్విసు వీనినిఁ జదివికొని తృప్తి సనెను. కాని తెనార్డిర్ ఇట్లు చెప్పఁదొడఁగెను:

''వాల్ జీన్ దొంగ, ఘాతకుఁడు అని రుజువుచేయు దును. ఇది దేవరహస్యము. ఆ హత్యచేఁ జూరగొనిన దంతయుఁ దమ భార్య కతఁ డిచ్చెను. అతఁ డిటు లొనరిం చుటవలన నొక గొప్ప కుటుంబమునఁ దూఱవచ్చును. అచట సుఖపడవచ్చును. నేరము కప్పివేసికొనవచ్చును. పేరు దాఁచి చూరగొన్న ధన మనుభవింపవచ్చును. ఇది యంతయు నొక మంచియెత్తు కాకపోదు.

''పోయిన జూన్ ఆఱవ తేదిరాత్రి తొమ్మిది గంటల

సమయమున సీనునదిలోఁ బడు మురికితూములో ఒక ధని కుని఼ జంపి దోఁచుకొని, వానిని బుజములమీఁద మోసికొని యం దొక దొంగయూబిలో దిగబడి, చచ్చి చెడి చివరకు వచ్చెను. అందుండి బయటఁబడుటకు నే నతనికి సాయము చేసితిని. ఈ నేరము పట్టియిచ్చుటకుఁగాను ఆ శవము కోటు గుడ్డ కొంతచింపి తీసికొంటి'' నని తెనార్డీర్ తాను దాఁచి యుంచిన యా గుడ్డముక్కను జేబునుండి వెలికిఁ దీసెను.

మార్యీసు దానిని బరికించి యా కోటు తెచ్చి—''ఆ శవము నేనే'' అని యా ముక్కను దాని కతుకఁగా నది సరిగా సరిపోయెను. అది విని తెనార్డీర్ రాపడెను. అపుడు మార్యీసు—''నీ వీ వాల్ జీన్ను దోషియని నిరూపింపవచ్చి, మహానుభావుఁడని తేల్చితివి. నీవే దొంగవు, ఘాతకుఁడవు. నీ వొకపుడు నా ప్రతివేశివి. కాని నీవు నన్నుఁ జూడలేదు. నేను నీ ప్రలయనాటకము చూచితిని. ఈ యిరువది వేల ఫ్రాంకులు నీ మొగమునఁ బెట్టుకో. నీ మొగము చూడరా''దని కొన్ని నోట్లు వానిమీఁద విసరెను. వాఁడు వానిని భద్రముగా జేబులోఁ బెట్టుకొని నిర్గమించెను.

వెంటనే మార్యీసు కోజెత్తును వెంట నిడుకొని వాల్ జీన్ గృహమునకు వెళ్లి వాలెను.

తలుపుకడఁ జప్పుడు కాఁగనే వాల్ జీన్—'లోపలికి దయచేయుఁడు' అని యనెను. కోజెత్తు తండ్రికడకుఁ బరుగిడెను. మార్యీసు వెనుకనే యుండి చూచుచుండెను.

'కోజెత్తూ! అమ్మా! వచ్చితివా?' అని పలుకు వాల్ జీన్ కనులలో ముత్తెములు బయలుదేరెను.

కోజెత్తు తనతండ్రిని జుట్టవేసికొని కూర్చుండి— "ఇవి నా వలువలే!" అని యనెను. "అమ్మా! గుఱితు వచ్చి వీనినిఁ బయికిఁ దీసితిని."

కోజెత్తున కిదియేమియు నర్థము కాలేదు. "ఇది యేమి నాయనా! మమ్మిటులు వేఱుపెట్టుట నీకు ధర్మమా? నా కర్మమా యిది? ఇది యేమి? నీ యొడలంతయు నీటిబుగ్గ. ఎంత చిక్కితి వెంత చిక్కితివి!" అని అనెను. "అయ్యా! దేవుఁడు మంచివాఁ డనుటకుఁ దారకాణగాఁ దమరుగూడ నన్ను క్షమింప నిచటికి దయచేసితిరి" అని వాల్‌జీన్ అనెను. అపుడు మార్యాసు—"కోజెత్! వింటివా వారి వినయపద్ధతి? తమ యుసుఱొడ్డి వీరు నన్ను బ్రతికించిరి. దీనికిఁ బై మాట—నిన్ను నా కొసఁగిరి. కోజెత్! మనకు దేవుఁడు దొరకెఁ జుమీ!" అని యనెను.

"చాలుఁ జాలు. ఏమిటి యిటులు వాకొనుచున్నారు?" అని వాల్‌జీన్ అనెను. "అయ్యా! తమరు నేనే మాదలేను నని యేల చెప్పరు? జేవరును జంపక విడిచితి నని యేల తెలుపరు?" అని మార్యాసనెను.

"నేను నిక్కమే చెప్పితిని."

"అది నిండు నిక్కము కాదు. మీరు పరమ పావనులు. బ్రతికినంతవట్టు మిమ్ము నే నారాధింతును. మీ రిచట నుండుటకు వీలులేదు. మీరు మా యిరువురకును దండ్రులు. రేపు తమ రిట నుండ వీలులేదు."

"అయ్యా! రేపు నే నిచటను నుండను, మీ యింటను నుండను. ఒక మాట—నే నొసఁగిన ధ

మన్యాయార్జితము కాదు. నే నర్జించిన విధమంతయు వ్రాసి యీ సొరుగున నుంచితిని. మీరు చూచుకొందురుగాక. ఆ సొరుగున నే 500 ఫ్రాంకుల నోట్లున్నవి. అవి పేదలకు..." అని జీన్ వాల్‌జీన్ చెప్పుచుండఁగా—"మీ రాయాసపడు చున్నారు. నే నాధనమును స్వీకరించితిని గాని తమరు మా యింటికి దయచేయవలయును" అని మార్యి సనెను.

"నే నిపుడే నిన్నుఁ గొంపోదును. క్రింద బండి యున్నది. మీరు రా నన్నను నే నెత్తుకొని తీసికొని పోవుదును" అని కోజెత్తు తండ్రి చంకలక్రిందఁ జేతులు వైచెను. అపు డతని యూర్ధ్వశ్వాస లామెకు వినఁబడెను. అంతలో వైద్యుఁ డచటికి వచ్చి నాడి చూచి మార్యిసుచెవిలో నేమో చెప్పెను. అపుడు జీన్ వాల్‌జీన్ లేచి మిగుల శ్రమతో గోడకడ కేఁగి సిలువ నెత్తెదుట నిడుకొని— "చూచితిరా యీ ధర్మవీరుని?" అని యనెను.

"అయ్యో! నాయన బ్రతుకవచ్చును జూడుఁడు" అని కోజెత్తనెను. వైద్యుఁడు చూచి మార్యిసుచెవిలో నేమో చెప్పిపోయెను. అపుడు వంటది వచ్చి—"అయ్యా! ధర్మాచార్యునిఁ బిలుచుకొన్ని రావలయునా?" యని యడిగెను. "ఆహా! నా కున్నాఁడు? అడుగో మిరియేలు భగవానుఁడు!" అని వాల్‌జీన్ పైకిఁ జూచెను.

అంత నతని కనులు మూఁతపడెను. కొంతసే పతఁడు మృత్యువుతోఁ బోరాడినటులును, ప్రేమతో స్వాగత మిచ్చు చున్నటులును గనఁబడెను. అతని దేహ మవశ మాయెను. మోమున దీప్తి వెలిఁగెను. అతఁడు కొంతసేపటికిఁ గనులు

దెఱచి—"అమ్మా! మీరిరువురు సంతత మనురక్తులయి యీ యనురాగమును భగవద్దర్శనమున కనుకూలముగాఁ జేసికొనుఁడు. నేను నిఱుపేదను. నన్నొక మాఱుమూల సమాధి చేయుఁడు. ఏ మిది చెపుమా? నా కొక వెలుఁగు కనవచ్చుచున్నది. మిమ్ము దీవించి పోదును" అని వారి యిరువుర తలలమీఁదఁ జేయి జాఁపి వెనుకకు వ్రేలఁబడెను. మిరియే లొసఁగిన దివియకంబముల వెలుఁగువెల్లువ యతని మోమునఁ బ్రసరించెను.

కోజెత్తును, మారియసును అతనిముందు మోఁకారించిరి. వారి కనులు ద్రవించెను. జీన్ వాల్ జీన్ తెల్లని మోము స్వర్గముదెసకు తిరిగి భగవంతుని బింబము ప్రతిఫలింపఁ జేసికొనుచు స్వచ్ఛమగు నద్దమువలె భాసించెను. కోజెత్తును, మారియసును జీన్ వాల్ జీన్ చేతులను ముద్దులలో ముంచిరి.

ఆ రేయి చుక్కలు లేవు. చీకటి దట్టముగానుండెను. అతని యాత్మను దేవసన్నిధికి గొంపోవుటకు దేవదూత రెక్కలు చాఁపి యచట నేచాటునో నక్కియుండును.

